Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 4 • 27-1-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# జగన్ గుట్టు సునీల్‌కే ఎరుక!

- అందుకే అంత కలవరం.
- ప్రతి రూపాయి లెక్కా సునీల్‌కు తెలుసు.
- నోరు విప్పితే కొంప కొల్లేరే!

తన ఇంటి మీద సిబిఐ దాడి జరిగిన రోజు వైఎస్.జగన్ పెద్దగా ఆందోళన చెందలేదు. సాక్షి పత్రికా కార్యాలయంలో సోదాలు చేసినప్పుడూ శబ్దం చేయలేదు. తన ఆంతరంగిక ఆర్థిక సలహాదారు విజయసాయిరెడ్డిని ఒకటికి ముప్పైసార్లు విచారించినా, చెరపట్టి చర్లపల్లి జైలుకు తరలించినా కలత చెందలేదు. కానీ పేరు వూరు లేని నర్రెడ్డి సునీల్‌రెడ్డి ఇంట్లో సిబిఐ అధికారులు అడుగు పెట్టగానే జగన్‌కు వెర్రెత్తిపోయింది. ఉక్రోషం వెలికి వచ్చింది. నన్ను, నా వాళ్లను ఇట్లా వేధించే బదలు ఒకేసారి తుపాకీతో కాల్చి చంపి పారేయవచ్చు కదా అని ఆక్రోశించాడు. ఆవేశ పడ్డాడు. సునీల్‌రెడ్డి విషయంలో ఆయన అంత కలత చెందడానికి కారణమేమిటి?

చందమామ కథలో రాక్షసుడి ప్రాణం ఏడు సముద్రాల అవతల మర్రిచెట్టు తొర్రలో చిలుక గొంతులో వుందని చెప్పినట్లు, జగన్‌కు సంబంధించిన సమస్త సమాచారం సునీల్‌రెడ్డి మనసులో దాగి వుండడం అందుకొక కారణమని అంచనా. సునీల్‌రెడ్డి, జగన్‌కు నీడ వంటివాడు. ఆయన ఎక్కడుంటే ఈయన అక్కడ వుండేవాడు. జగన్ చేసే ప్రతి పనిలో సహాయకుడిగా వ్యవహరించేవాడని చెప్తారు. వైఎస్ ముఖ్యమంత్రిగా వున్న రోజులలో సునీల్ పాత్ర చాలా కీలకం. జగన్ మనసులోని మాటను, అవసరాలను ఆయనకు చేరవేసే రాయబారి సునీల్. దానికి అనుగుణంగా ఖర్చులకు అవసరమైన సొమ్ము సునీల్ ద్వారానే జగన్‌కు చేర్చేవాడట వైఎస్. కెవిపి రామచంద్రరావుతో జగన్‌కు మొదట నుంచీ సత్సంబంధాలు వుండేవి కావు. అయితే తన సంపాదన సమస్తం కెవిపి ఇంటి వద్దనే సేకరించడం వైఎస్‌కు అలవాటు. కెవిపి నుంచి సొమ్ము తీసుకోవడానికి జగన్ ఇష్టపడేవాడు కాదు. అందువల్ల జగన్ అవసరాలకు సంబంధించి మాత్రం వైఎస్ స్వయంగా సునీల్‌ను పిలిచి, ఎవరి నుంచి ఎంత తెచ్చుకోవాలో చెప్పేవాడట. ఢిల్లీ పెద్దలకు, ఎన్నికల నిర్వహణకు, తన స్వంత విరాళాలకు డబ్బు చేర్చే బాధ్యత మాత్రం కెవిపి మీదనే వుండేది.

ఈ క్రమంలో సునీల్ ద్వారా కొన్ని వేల కోట్ల రూపాయల నల్లధనం జగన్‌కు చేరిందన్నది సిబిఐకి అందిన సమాచారం. విజయసాయి రెడ్డికి ఎంత సొమ్ము ఏ ఏ కంపెనీలలోకి వచ్చిందో, దాన్ని ఏ రకంగా వాటాల రూపంలోకి మార్చారో మాత్రమే తెలుసు. వచ్చిన సొమ్మును తెల్లధనంగా మార్చడం వరకే ఆయన బాధ్యత. కానీ సునీల్‌రెడ్డికి ఎవరెవరి నుంచి ఎంత నల్లధనం వచ్చిందో తెలుసు. దానికి తోడు జగన్ వ్యక్తిగత విషయాలలోనూ సునీల్ ప్రమేయం ఎంతో వుందని చెప్తారు. జగన్ ఇంట్లో సునీల్ కూడా ఒక సభ్యుడు. ఆయన సాగర్ సొసైటీ ఇంట్లో వున్నప్పుడు ఇంటి వ్యవహారాలన్నీ సునీల్ చక్కబెట్టేవాడు. జగన్ స్నేహితులెవరు, ఆయన ఎప్పుడెప్పుడు ఎవరెవరిని కలిసేవాడు, ఆ సమావేశాలు ఎక్కడ జరిగేవి అన్న వివరాలు కూడా సునీల్‌కు తెలుసు. అందువల్లనే సునీల్ అరెస్ట్ వార్త జగన్‌ను అంతగా కలత పెట్టింది.

విజయసాయిరెడ్డి ఎంత తరచి తరచి అడిగినా పెదవి విప్పడం లేదు. సిబిఐ అధికారులకు కొరకరాని కొయ్యగా తయారయ్యాడు. కానీ సునీల్ అంత కఠినంగా జగన్ రహస్యాలను దాచి పెడతాడా అన్నది సందేహం. సునీల్‌రెడ్డి నోరు విప్పితే బ్రహ్మాండం బ్రద్దలైపోతుంది.

సునీల్‌రెడ్డి అరెస్ట్ వెనుక తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు కీలక పాత్ర పోషించాడని జగన్ అనుమానం. ఎమ్మార్ విల్లాల అమ్మ

కొరవ 14వ పేజీలో

## ● చంద్రబాబు గుట్టు విప్పనున్న పిఎన్‌వి ప్రసాద్!

తనను సిబిఐ కేసులలో ఇరికించడానికి ప్రధాన కారకుడు తెలుగుదేశం చంద్రబాబు నాయుడని జగన్ నమ్మకం. ఆయన దన్ను లేకుంటే ఈనాడు రామోజీరావు అంత దూరం వెళ్లి, తన ఆస్తుల మీద, కంపెనీల మీద లోతుగా పరిశోధన జరిపించలేడని జగన్ అంచనా. సిబిఐ కేసులు పెట్టింది, దర్యాప్తు జరిపిస్తున్నదీ కాంగ్రెస్ నేతలే అయినప్పటికీ, వాటికి మూలం మాత్రం చంద్రబాబు వద్దే మొదలైందని భావిస్తూ వుంటాడు. తనను ఇంతగా ఇబ్బంది పెడుతున్న చంద్రబాబుకు తగిన గుణపాఠం చెప్పాలన్న పట్టుదల జగన్‌లో ఇటీవల బాగా బలపడింది. అయితే చంద్రబాబు లావాదేవీల పై ఇప్పటి వరకు జగన్‌కు విశ్వసించదగిన సమాచారం దొరకలేదు.

ఇన్నాళ్లకు ఆ కోరిక తీర్చబోతున్నాడు పిఎన్‌వి ప్రసాద్. పూర్వాశ్రమంలో తెలుగుదేశం కార్యాలయ నిర్వాహకుడిగా పనిచేసిన పిఎన్‌వి. ప్రసాద్, ఎంత చాకిరీ చేసినా బాబు దగ్గర గుర్తింపు లేదనే కినుకతో మొదట చిరంజీవి ప్రజారాజ్యం పార్టీ సేవకు తరలి వెళ్లాడు. అయితే అక్కడా సంతృప్తి కలగక పోవడంతో జగన్‌ను

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




ఆ హీరోల సినిమాలు చూసి నేర్చుకున్నది ఇదేనట మరి!

# అంబేద్కరుకు అవమానం

విగ్రహారాధనను తీవ్రంగా నిరసించిన బిఆర్.అంబేద్కర్‌ను, విగ్రహాల రూపంలో తమ కళ్ల ఎదుట నిలుపుకొని ఆరాధిస్తున్నది దళిత సమాజం. దళిత ఉద్యమ వికాసానికి ఆ విగ్రహాలు ఒక సంకేతం. వాటి నుంచే స్ఫూర్తి. అంబేద్కర్ నిరసించిన విగ్రహారాధన వేరు. హిందు సమాజాన్ని తరాలుగా, యుగాలుగా మతం మత్తులో ముంచెత్తి, అగ్రవర్ణాలు అధమ కులాలుగా విడగొట్టి, దళిత ప్రజల జీవితాలను దుర్భరం చేసిన మను ధర్మ శాస్త్రాన్ని తెగనాడడానికి విగ్రహారాధన సంస్కృతిని నిరసించాడు అంబేద్కర్. ఆయన ఆశయాలను ఆచరణలోకి తేవడానికి, అనుక్షణం ఆయన భావాల నుంచి స్ఫూర్తి పొందడానికి, తద్వారా దళిత జాతికి సమాజ న్యాయం కల్పించడానికి ఆయన విగ్రహాలను వూరూరా నెలకొల్పారు దళిత నేతలు. ప్రపంచంలో అధిక సంఖ్యలో విగ్రహాలు వున్న నేతలలో అంబేద్కర్‌ది రెండవ స్థానమని చెప్తారు.

హిందు సంస్కృతిలోని కుల వ్యవస్థపైన తన జీవితాంతం వరకు పోరాటం చేశాడు అంబేద్కర్. కానీ దురదృష్టవశాత్తు ఆయనను కేవలం మాల కులం ప్రతినిధిగా మాత్రమే చిత్రీకరిస్తున్నారిప్పుడు. ఆయన స్మృతికి అంతకంటే వేరొక అవమానం అవసరం లేదు. అంబేద్కర్ దృష్టిలో దళితులనే పదానికి చాలా విస్తృత అర్థం వుంది. దాన్ని విస్మరించి, ఆయనకు పోటీగా మాదిగలు జగజ్జీవన్‌రాం విగ్రహాలను, వెనుకబడిన తరగతుల వారు మహాత్మా జ్యోతిరావ్ పూలే విగ్రహాలను నెలకొల్పుతున్నారు. అంబేద్కర్ జీవన పోరాటం తమకే మాత్రం సంబంధం లేదనే ధోరణిలో వ్యవహరిస్తున్నారు మాలలు కాని దళితులు.

జమీన్‌రైతు

కోనసీమలో అంబేద్కర్ విగ్రహాల విధ్వంసానికి ఈ సంకుచిత దృష్టి ఒక కారణం. అమలాపురం ప్రాంతంలో మాలలకు, కాపులకు రాజకీయ, సామాజిక సంఘర్షణ వుంది. అది అప్పుడప్పుడు వీధి పోరాటాలకు దారి తీస్తుంటుంది. ఇప్పుడు తాజాగా ఆ విరోధం అంబేద్కర్ విగ్రహాల ధ్వంసానికి కారణమైంది. అంబేద్కర్ విగ్రహాలను విరగగొట్టి, మాలల మీద తమకున్న కక్ష తీర్చుకొన్నారు దుండగులు. దాన్ని తమకు జరిగిన అవమానంగా భావించారు అక్కడి దళితులు. ఈ దుశ్చర్యకు పాల్పడిన వారిని కఠినంగా శిక్షిస్తామని హోంమంత్రి, డిజిపి ఇచ్చిన హామీలు వారి ఆవేశాన్ని చల్లార్చలేక పోతున్నాయి. పడగొట్టిన ప్రతి విగ్రహాన్ని ప్రభుత్వ ఖర్చుతో పునః ప్రతిష్టిస్తామని ముఖ్యమంత్రి నచ్చ చెప్ప చూసినా ఫలితం కన్పించడం లేదు. వందలాది మంది పోలీసులు అమలాపురం వీధులలో పహారా కాస్తున్నారిప్పుడు. మాల, కాపు కులాలకు చెందిన రాష్ట్రమంత్రులు బృందాలుగా అక్కడకు వెళ్లి తమ కులాల నేతల ఆవేశాన్ని చల్లార్చే ప్రయత్నం చేస్తున్నారు.

ఆర్థికంగా, సామాజికంగా, నాగరికత పరంగా ఎంతో వృద్ధిలోకి వచ్చిన కోనసీమలో కుల పోరాటం సిగ్గుమాలిన తనం కాదా అన్నది ప్రశ్న. ఇతరత్రా ఎంత ఎదిగినా మనుషుల మనసులు ఎంతగా కుంచించుక పోతున్నాయో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. అంబేద్కర్‌ను జాతి నేతగా కాక, ఒక కుల ప్రతినిధిగా చూడడం, మనల్ని మనమే అవమానించుకోవడం. ఏ జాతికైనా జాతి నేతలు మానసిక కరదీపికల వంటివారు. తమ జాతి గురించి గర్వపడే అంశాలను తరచూ స్మరించుకొన్నంత కాలమే జాతి మనుగడ, వృద్ధి సాధ్యం. ఆ స్మరణకు వూతమిచ్చేది జాతి నేతల జీవిత గాథలు. గాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ, నేతాజి, వల్లభాయ్ పటేల్, మౌలానా వంటి జాతి నేతలకు ఏ కోణంలోనూ తీసిపోని ధీరోధాత్తుడు అంబేద్కర్. రాజ్యాంగ నిర్మాణం ఆయన ఈ దేశానికి చేసిన అద్భుత సేవలో ఒక చిన్న భాగం మాత్రమే.

సమాజాన్ని కుష్టు రోగం వలె పట్టి పీడిస్తున్న అస్పృస్యతా నివారణకు, దళితులు ఆత్మగౌరవంతో జీవించే పరిస్థితి నెలకొల్పడానికి అంబేద్కర్ చేసిన కృషి మన దేశానికి ఎంతగానో ఉపయోగపడింది. అంధ విశ్వాసాలు, దుష్ట సాంప్రదాయాల బురద గుంటలో దొర్లాడే దశ నుంచి, మనల్ని మనం మనుషులుగా మార్చుకోవడానికి ఆయన ఇచ్చిన ప్రేరణ పరోక్షంగా పని చేసింది. అంతటి మహనీయుడిని ఒక కులం ప్రతినిధిగా ఎంచి, విగ్రహాల ధ్వంసంతో అవమానించ చూడడం ఘోరమైన పాపం, క్షమించరాని నేరం.

## జనవాణి

### ప్రభుత్వమే వ్యసనపరులను చేస్తోంది!

మద్యం అమ్మకాలే ప్రధాన ఆదాయ వనరుగా ప్రభుత్వం అబ్కారీ విధానాన్ని రూపొందించి ప్రజలను ఈ వ్యసనానికి బానిసలు అయ్యేందుకు పరోక్షంగా ప్రోత్సహిస్తోంది. యువతలో 70శాతం, అందులో 40శాతం దిగువ మధ్యతరగతికి చెందినవారు ఈ మద్యం మత్తులో మునిగి తేలుతున్నారని సర్వేలు చెబుతుంటే, పరిస్థితి ఎంత దారుణంగా వుందో అంచనా వేయవచ్చు. ప్రభుత్వం ఈ విధంగా ప్రజలను దోచుకొంటుంటే మరోవైపు మద్యం సిండికేటు ఎంఆర్‌పి ధరల కంటే 30శాతం అధికంగా వసూలు చేస్తూ మరింత దోపిడీ చేస్తున్నారు. బీదా బిక్కి ఈ రేట్లు భరాయించలేక కల్తీ మద్యాన్ని ఆశ్రయించి ప్రాణాలు పోగొట్టుకొంటున్నారు. బెల్టు షాపులు నిరోధించి మద్యం ఎంఆర్‌పి ధరలకు విక్రయించేలా చూడాలని కోర్టు ఆదేశాలిచ్చినా ప్రభుత్వ పెద్దలకు, అధికారులకు ఈ ఆదాయంలో వాటా వుండటంతో ఒట్టి గద్దింపులతో కాలం గడుపుతున్నారు. ఎంఆర్‌పి రేట్లకు అమ్మాలని షాపు వారిని ఎవరైనా నిలదీస్తే వారిని రౌడీల చేత బెదరించడం, కొట్టించడం జరుగుతోంది. ఎమ్మార్పీ ధరలకే మద్యం అమ్మేలా గట్టి పోరాటం అవసరం.

సిహెచ్.హనుమంతరావు — నెల్లూరు

### సామాన్యుడు బతికేదెలా?

రాష్ట్ర ప్రభుత్వ నిర్లక్ష్య ధోరణితో సగటు పేదవాడి జీవనం కడు దుర్భరమైపోతోంది. ధరలు విపరీతంగా పెరిగి కొనుగోలు శక్తి నశించిపోతోంది. మళ్లీ విద్యుత్ ఛార్జీలు పెరగడం, రవాణా చార్జీ పెరగడం వీటిపై ప్రభుత్వానికి అదుపు లేకుండా పోవడం క్షమించరాని విషయం. ఎన్నిరకాలుగా ధరలు పెరిగినా తట్టుకొనే సామర్థ్యం వున్న మంత్రులు, శాసనసభ్యుల జీతాలను లక్షల్లో పెంచడం గమనార్హం. పేద ప్రజల సంక్షేమం, జీవన విధానం గూర్చి సుప్రీంకోర్టు జోక్యం చేసుకోవాలి.

ఎం.ప్రభాకర్ — నెల్లూరు

### ములుమూడి బస్టాండ్‌లో మురుగువాసన!

నెల్లూరు ములుమూడి బస్టాండ్ నుంచి బస్సులు, ఆటోల్లో పొట్టేపాళెం, జొన్నవాడ, ములుమూడి, సౌత్‌మోపూరు గ్రామాలకు వందలాది ప్రజలు నిత్యం వెళ్తుంటారు. ప్రస్తుతం నాలుగుకాళ్ల మండపం సెంటర్‌లో వున్న ఈ బస్టాండ్‌లో కనీస సౌకర్యాలు లేవు. డ్రైనేజి నీళ్లు రోడ్లపై పొంగిపొర్లుతుంటాయి. త్రాగేందుకు మంచినీటి సౌకర్యం, కూర్చొనేందుకు చిన్నపాటి షెల్టర్ కూడా లేదు. రాత్రివేళ ఇక్కడ బస్సుల కోసం వేచి వుండే ప్రయాణీకులు దోమల చేత కుట్టించుకోవాల్సి వస్తోంది. ములుమూడి బస్టాండ్‌లో కనీస సౌకర్యాల కల్పనకు జిల్లా అధికార యంత్రాంగం తగిన చర్యలు తీసుకోవాలి.

మహ్మద్ అమూరుల్లా — నెల్లూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

30-1-1941
పేజీలు : 8 వెల: అణా

### కొత్త హాలులో గలాటా

19వ తేది రాత్రి 8.30 గంటలప్పుడు నెల్లూరు కొత్త హాలులో ఆట జరుగుతూ ఉండగా, పురుషులుండే చోట నీళ్ల పాము కనపడినదనీ బెంచీలలో, కుర్చీలలో కూర్చుండిన పురుషులు గాభరాపడి స్త్రీలుండు కంపార్టుమెంటులోకి దూకినారనీ, అచటి స్త్రీలు, పురుషులు దుముకుట చూచి భయపడి పెద్ద కేకలు వేసినారనీ, హాలంతా కలవరమైందనీ రౌడీలు యదేచ్ఛగా విహరిస్తున్నా, దీపాలు వెలగలేదనీ, బొమ్మలు తిరుగుచూనే ఉండినవనీ, చుట్టుప్రక్కల వారూ, పోలీసులు పరుగెత్తి వచ్చిరనీ, హిందు స్త్రీలు ఇండ్లకు వెళ్లారనీ తెలుస్తున్నది.

### నెల్లూరు ముచ్చట్లు

#### అర్బన్ బ్యాంకి

అర్బన్ బ్యాంకి ఎన్నికల్లో విఆర్ హైస్కూలు టీచర్లు కాకుటూరు నరశింహారావు, వేగూరు వెంకటప్పయ్య గారలను తిరుగా డైరక్టర్లుగా యెన్నుకోవడం మాకు సుతరాం ఇష్టం లేదు. అది వ్యక్తిగత ఆక్షేపణ గాదు. టీచర్లు ఇతర గొడవల్లో తలదూర్చగూడదనే మా పాత అభిప్రాయం మారలేదు.

#### బాల గజదొంగ

తోటపల్లి గూడూరు పంగలూరు సుబ్బరామయ్య అనే షుమారు 15 సంవత్సరముల వయస్సుగల బలిజ బాల గజదొంగను నెల్లూళ్లో సబ్‌ఇన్స్‌పెక్టర్ కన్నబాబు 25వ తేది అరెస్టు చేశాడు. వీడు జగయ్యశెట్టి ఇంట్లో బంగారు గజ్జలు, రమణయ్య ఇంట్లో బంగారు దండ, పప్పులవీధి పెండ్లి పార్టీలో కలెక్టరు ఆఫీసు గుమస్తా సుబ్బరామయ్య ఇంట్లో దండ, ముత్తరాజు రామారావు యింట్లో లోలాకులు, పి.టి.గోపాలాచారి యింట్లో చేతి గడియారం, ఇంకా ఎన్నో దొంగతనాలు చేసిన ఘనుడట.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

26-1-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### కాంగ్రెస్ శుభారంభం

ఆంధ్ర, మద్రాసు, ఒరిస్సాలలో కాంగ్రెస్‌కు శుభారంభం.

మద్రాసులో కేంద్ర మాజీ ఆర్థిక మంత్రి టి.టి.కృష్ణమాచారి పోటీ లేకుండా ఎన్నుకోబడినారు. వీరి ఎన్నికల వల్ల బొంబాయి మార్కెటు ధరలు పడిపోయాయట.

ఒరిస్సా మాజీ ముఖ్యమంత్రి హరేకృష్ణ మెహతాబ్ గూడా నిష్పోటీగా ఎన్నికైనారు.

ఇక ఆంధ్రలో నాలుగు శాసనసభ స్థానాలు పోటీ లేకుండా కాంగ్రెస్‌కు లభించినాయి. ఎన్నికైనవారు – 1. కర్నూలు జిల్లా కోయిలగుంట్ల బి.వి.సుబ్బారెడ్డి, 2. ఆలూరు నియోజకవర్గం లక్ష్మీకాంతరెడ్డి, 3. తెలంగాణలోని వికారాబాద్ రిజర్వుడు అరిగె రామస్వామి, 4. శ్రీకాకుళం జిల్లా పొందూరు రిజర్వుడు కె.పున్నయ్య.

ఆంధ్రలో కాంగ్రెస్ విజయానికి ఇవి శుభసూచన.

### ఎలక్షన్ ముచ్చట్లు

#### నాయుడు గారి కృషి

సర్వేపల్లి, రాపూరులలో కాంగ్రెస్ ఆత్మ విధ్వంసక కృత్యాలకు స్వస్తి చెప్పించుటకు, జిల్లా పరిషత్ అధ్యక్షుడు చెంచు రామానాయుడు గారు నిన్న, మొన్న తీవ్రమైన కృషిజేసి విఫలులైనారు. నాయుడుగారి చిత్తశుద్ధిని, ఆవేదనను, ఆసక్తిని అర్థం జేసుకొని సానుభూతి చూపవలసిందేగానీ ఈ విద్రోహ చర్యలను నివారించడం విధాతకు గూడా చేతగాని పనని చెప్పకతప్పదు.

# నెల్లూరు ముచ్చట్లు

## నెల్లూరీయునికి రాష్ట్రపతి పతకం!



నెల్లూరీయుడు, న్యూఢిల్లీలో ఇంటర్నేషనల్ కస్టమ్స్ విభాగంలో డైరక్టర్‌గా పనిచేస్తున్న మూలంరెడ్డి సతీష్ కుమార్ రెడ్డికి ఉత్తమ సేవలకుగాను రాష్ట్రపతి సేవా పతకం లభించింది. రిపబ్లిక్‌డే నాడు దీన్ని సతీష్‌కుమార్‌రెడ్డి రాష్ట్రపతి ప్రతిభా పాటిల్ చేతులమీదుగా అందుకొంటారు. సతీష్‌రెడ్డి నెల్లూరు విఆర్ కాలేజిలో ఇంటర్మీడియట్ వరకు చదివి హైదరాబాద్‌లోని సిబిఐటిలో బిటెక్ పూర్తి చేశారు. 1993 సంవత్సరంలో యుపిఎస్‌సి నిర్వహించిన పరీక్షల్లో ఐఆర్ఎస్‌కు ఎంపికయ్యారు. తోటపల్లి గూడూరు మండలం వెంకన్నపాళెం సర్పంచ్‌గా 30 ఏళ్లపాటు పనిచేసిన వెంకట కృష్ణారెడ్డి మనమడే సతీష్ కుమార్‌రెడ్డి. రాష్ట్రపతి చేతులమీదుగా ఉత్తమ సేవాపతకం పొందిన సతీష్ కుమార్‌రెడ్డికి మా అభినందనలు.

## రోడ్డు ప్రమాదంలో నెల్లూరీయుల మరణం

బెంగుళూరు నగర శివారులో 24వ తేదీ వేకువజామున జరిగిన రోడ్డు ప్రమాదంలో నెల్లూరు యువకులు డాక్టర్ మిస్బా, సులేమాన్ అక్కడికక్కడే మరణించగా, మరో యువకుడు ప్రమోద్‌కు తీవ్ర గాయాలయ్యి అక్కడి నిమ్హాన్ వైద్యశాలలో చికిత్స పొందుతున్నాడు. డాక్టర్ మిస్బా గర్ల్‌వీధిలోని మాజీ కాంగ్రెస్ నేత మొహియుద్దీన్ కుమారుడు. ఇటీవలే ఎంబిబిఎస్ పూర్తిచేసిన ఆయన బొల్లినేని హాస్పిటల్‌లో డాక్టర్‌గా పనిచేస్తున్నాడు. సులేమాన్‌ది కుమ్మరివీధి. మార్కెట్‌లో కూరగాయల వ్యాపారి. ప్రమోద్‌ది జొన్నలగడ్డవారి వీధి. వీరంతా మంచి మిత్రులు. మిస్బాకు రెండు నెలల క్రితం వివాహం జరిగింది. సులేమాన్ వివాహితుడు. ప్రమోద్ అవివాహితుడు. వీరంతా కలసి బెంగుళూరు వెళ్లి తిరిగి వస్తుండగా ఈ ప్రమాదం జరిగింది.

## కూరగాయల ధరలు బాగా పెరిగాయి

కూరగాయల ధరలు విచిత్రంగా పెరిగిపోయాయి. వంకాయలు 50, క్యారట్, బీన్స్, బీరకాయలు, బెండకాయలు కిలో 40 రూపాయలు పలుకుతున్నాయి. మూడు నుంచి ఐదు రూపాయల మధ్య దొరికే సొరకాయ 20 రూపాయలు, పొట్లకాయ 20 రూపాయలమ్ముతున్నారు. టమోటా మినహా మరే కూరగాయ కొని తినేట్లు లేదు.

## కోవూరు నేతలకు సిఎం ఫోన్లు!

కోవూరు అసెంబ్లీ స్థానానికి ఉప ఎన్నికను ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి కూడా సీరియస్‌గా తీసుకొంటున్నారు. 22వ తేదీ నుంచి రోజుకు ఐదు మంది చొప్పున కోవూరులో పార్టీ ముఖ్య నేతలు, పారిశ్రామికవేత్తలు, ఇతర వర్గాల ప్రముఖులకు ఫోన్ చేస్తున్నారు. ఇక్కడ పార్టీ నిలపబోయే అభ్యర్థిని గెలిపించేందుకు సహకరించమని కోరుతున్నారు. ముఖ్యమంత్రి అభ్యర్థనపై నేతలు ఏ మేరకు స్పందిస్తారన్నది ఇప్పుడప్పుడే చెప్పలేం.

## కాంగ్రెస్ గొడ్డుబోతు!

ప్రతిపక్షనేత చంద్రబాబు నాయుడు 19వ తేదీ కావలిలో రెండు గంటలపాటు థానే తుపాన్ బాధిత రైతులను పరామర్శించారు. పొగాకు రైతులు ఏవిధంగా నష్టపోయింది పంట పొలాల్లోకి వెళ్లి చూశారు. పాలిచ్చే ఆవు లాంటి తెలుగుదేశం పార్టీని కాదనుకొని గొడ్డుబోతులాంటి కాంగ్రెస్‌ను అందలం ఎక్కించడం వల్ల రైతులకు ఇన్ని కష్టాలు వచ్చాయన్నారు. రైతులకు ఉచిత విద్యుత్, ఇతర వర్గాలకు సంక్షేమ పథకాలను తాను అమలు పరచకపోవడం తప్పేనని ఒప్పుకొన్నారు. తాను మారుతానని రైతులకు అండగా ఉంటానని ఆయన చెప్పుకొన్నారు. తన దగ్గర పనిచేసిన దువ్వూరు సుబ్బారావు వంటి ఐఎఎస్ అధికారులు ఆర్‌బిఐ గవర్నర్ వంటి పదవులను అధిష్టిస్తే వైఎస్ రాజశేఖర్‌రెడ్డి దగ్గర పనిచేసిన అధికారులు జైలుకు వెళ్తున్నారన్నారు.

## ఆదాలకు పదవి

సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డిని ప్రభుత్వ రంగ సంస్థల కమిటీ ఛైర్మన్‌గా స్పీకర్ నాదెండ్ల మనోహర్ నియమించారు. శాసనసభలోని ఎనిమిది సభా సంఘాలకు గత వారం స్పీకర్ ఛైర్మన్లను నియమించారు. గతంలోనూ ఆరేళ్లపాటు ప్రభుత్వ హామీల కమిటీ ఛైర్మన్‌గా పనిచేసిన అనుభవం ప్రభాకర్‌రెడ్డికి ఉంది.



## ప్రజాపద్దుల కమిటీలో వివేకా!

అసెంబ్లీలో శాసనసభ్యుల నేతృత్వంలో నడిచే ప్రజాపద్దుల కమిటీలో సభ్యునిగా నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి నియమితులయ్యారు. గతంలోనూ ఇదే కమిటీలో సభ్యునిగా పనిచేసిన అనుభవం ఉందాయనకు.

గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్‌ను అటవీ, పర్యావరణ, కాలుష్య నియంత్రణ కమిటీలో సభ్యునిగా స్పీకర్ నియమించారు. జిల్లాలోని పది మంది శాసనసభ్యుల్లో ముగ్గురికి వివిధ కమిటీల్లో ప్రాతినిధ్యం వహించే అవకాశం రావడం ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

## చంద్రబాబు పలకరింపులు

కోవూరు స్థానానికి ఉప ఎన్నిక జరుగుతున్న నేపథ్యంలో తెలుగుదేశం పార్టీ అధినేత నారా చంద్రబాబు నాయుడు ఈ ప్రాంత ముఖ్య నేతలతో ఫోన్‌లో మాట్లాడుతున్నారు. నేను చంద్రబాబును; అందరూ క్షేమమేనా అంటూ పార్టీ అధినేత పలకరిస్తుండడంతో తెలుగు తమ్ముళ్లు ఉబ్బిపోతున్నారు.

## సిబిసిఐడి డిఎస్పీ బదలీ!

జిల్లాలో 500 కోట్ల రూపాయల మేర జనం డబ్బు స్వాహాచేసిన మనీ సర్క్యులేషన్ స్కీంల నిర్వాహకుల పని పడుతున్న సిబిసిఐడి డిఎస్పీ జి.విజయకుమార్‌ను ప్రభుత్వం బదలీ చేసింది. దీనికిగాను ఏదో సాకులు చెబుతుంది. మనీ సర్క్యులేషన్ స్కీం నిర్వాహకులు మహాజాదులు. అధికారంలో ఉన్న నేతలకు, వీళ్లకు కొన్ని లింకులున్నాయి. మనీ సర్క్యులేషన్ స్కీంలో నష్టపోయిన ప్రజలు ఈ వ్యవహారమై ఉద్యమిస్తే తప్ప ఈ బదలీ ఆగదు. చేజార్చుకొన్న డబ్బు తిరిగి పొందలేరు.

## వ్యవసాయశాఖ జెడి బదలీ

వ్యవసాయశాఖ జాయింట్ డైరక్టర్ నరసప్ప బదలీ అయ్యారు. ఆయన స్థానంలో కరీంనగర్ ఆత్మ ప్రాజెక్ట్ కె.హెచ్.ఓ సుబ్బారావును నియమించారు. నరసప్ప 2010 జూలై నెలలో నెల్లూరుకు వచ్చారు. అప్పటి నుంచి ఈ కార్యాలయంలో గొడవలే గొడవలు.

## జిల్లాలో లక్ష సమస్యల గుర్తింపు!

జిల్లాలోని 46 మండలాల్లో ప్రజలు అక్షరాల లక్ష సమస్యలతో బాధపడుతున్నట్లు సాక్షాత్తూ కలెక్టర్ శ్రీధర్ రెడ్డి ప్రకటించారు. ఈ సమస్యలను ఇందిర క్రాంతి పథం సిబ్బంది అర్జీల రూపంలో ప్రజల నుంచి తీసుకొన్నట్లు కలెక్టర్ గోల్డెన్ జూబ్లీహాల్‌లో తహశీల్దార్లతో ఏర్పాటుచేసిన సమీక్షా సమావేశంలో పేర్కొన్నారు. మన విఆర్‌ఓలు, ఆర్‌ఐలు, తహశీల్దార్లు సమస్యలు గుర్తించరు. ఒకవేళ గుర్తించినా పరిష్కరించరని చమత్కరించారు కలెక్టర్. ప్రజా సమస్యల పరిష్కారం ధ్యేయంగా పనిచేయాలని రెవిన్యూ సిబ్బందికి సలహా ఇచ్చారాయన.

## తహశీల్దార్ సస్పెన్షన్

కనిగిరి తహశీల్దార్ శ్యామలా దేవిని సస్పెండ్ చేస్తూ డిఆర్వో రామిరెడ్డి ఉత్తర్వులు జారీ చేశారు. ఈమె మండలంలోని గుడ్లదొన గ్రామానికి చెందిన రైతు నుంచి రెండువేలు లంచం స్వీకరిస్తుండగా ఎసిబి పట్టుకొని జైలుకు పంపడంతో ఈమెను సస్పెండ్ చేయకతప్పలేదు.

## వస్త్ర వ్యాపారుల బంద్

ఏ రాష్ట్రంలో లేనివిధంగా మన రాష్ట్రంలో వస్త్రాలపై వ్యాట్‌ను విధిస్తున్నందుకు నిరసనగా నెల్లూరులోని వస్త్ర వ్యాపారులు 23వ తేది నుంచి షాపులు బంద్ చేస్తున్నారు. 31వ తేది వరకు ఈ బంద్ కొనసాగుతుంది. జిల్లావ్యాప్తంగా వస్త్ర దుకాణాల బంద్ విజయవంతంగా కొనసాగుతుంది. ఈ బంద్‌లో పాలుపంచుకోని చందన బ్రదర్స్ సంస్థల షాపింగ్ మాళ్లను 24వ తేది నగరంలోని వస్త్ర వ్యాపారులంతా వచ్చి మూయించారు.

## భవిష్యత్తు తెలుగుదేశం పార్టీదే!

రెండేళ్లలో తెలుగుదేశం పార్టీ తిరిగి అధికారంలోకి వస్తుందని జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ధీమా వ్యక్తం చేశారు. 22వ తేదీ నెల్లూరు తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో సర్వేపల్లి నియోజకవర్గ కార్యకర్తలకు పార్టీ సభ్యత్వమిస్తూ మాట్లాడారు. రాష్ట్రంలో అసమర్థ కాంగ్రెస్ పాలన నడుస్తుంది. నిత్యావసర వస్తువుల ధరలు రోజురోజుకు పెరిగిపోతున్నాయి. ప్రజలు ఈ ప్రభుత్వంతో విసిగిపోయారు. మరో ప్రక్క వైఎస్ జగన్మోహన్‌రెడ్డి అవినీతి అక్రమాలకు కూడా చరమగీతం పాడే రోజు దగ్గరలో ఉందన్నారు. జిల్లాలో ఉప ఎన్నికలు జరిగే కోవూరు, ఉదయగిరి అసెంబ్లీ స్థానాలను తెలుగుదేశం పార్టీ గెలుచుకొంటుందన్నారు.

కొరవ 14వ పేజీలో

● జోరుగా దొంగతనాలు

## జోగుతున్న పోలీసులు!

● క్రైం ఎస్ఐ ఇంట్లో చోరీ అవమానం కాదా?



దొంగతనం జరిగిన ఇంట్లో వేలిముద్రలు సేకరిస్తున్న క్లూస్‌టీం.

నగరంలో రోజురోజుకు దొంగతనాలు అధికం అవుతున్నాయి. పగలు, రాత్రి అనే తేడా లేకుండా దొంగలు ఇళ్లలో చొరబడి దోచుక పోతుండడంతో నగర వాసులకు కంటి మీద కునుకు లేకుండా పోతోంది. చోరీలను అరికట్టాల్సిన పోలీసులు నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తుండడం, దొంగలు పడ్డ ఆరు నెలలకు అన్న చందంగా దొంగతనం జరిగి సర్వం కోల్పోయిన బాధితుల వద్దకు క్లూస్‌టీమ్‌లు, డాగ్ స్క్వాడ్‌లను తీసుకెళ్లి హడావుడి చేయడం తప్ప ముందస్తు నిఘా లేకపోవడంతో దొంగతనాలు జోరందుకొన్నాయి. శివారు ప్రాంతాలు, జనసంచారం అధికంగా ఉండే ప్రాంతాలన్న తేడా లేకుండా దొంగతనాలు జరుగుతుండడంతో ప్రజలు హడలి పోతున్నారు. పోలీసులు మాత్రం అంతర్ జిల్లా దొంగ దొరికాడు, గజదొంగలు దొరికారని చెప్పి ఫోటోలకు ఫోజులిచ్చి చేతులు దులుపుకోవడం తప్ప పాత నేరస్తులపై తగిన నిఘా పెట్టక పోవడం వల్లే దొంగతనాలు అధికంగా జరుగుతుండడానికి కారణమన్నది స్పష్టమవుతోంది. నగరంలో గస్తీ కూడా నామమాత్రంగా ఉంటోంది. నైట్ బీట్ చేసే పోలీసులు విధులు ఎగ్గొట్టి సినిమా హాళ్లు, బార్లలో బిజీ బిజీగా ఉంటున్నారు తప్ప గస్తీ తిరగడం లేదు. బీట్ బుక్‌ను స్టేషన్ నుంచి తీసుకొని కేటాయించిన ప్రాంతంలో బీట్ చూడాల్సిన పోలీసులు కొద్దిసేపు తచ్చాడి, విజిట్ అంటూ హడావిడి చేసి 10 గంటల కల్లా కన్పించకుండా పోతున్నారనే ఆరోపణలు వినవస్తున్నాయి. ఎప్పుడో పై అధికారులు తనిఖీకి వస్తున్నారని తెలిసినప్పుడు తప్ప సాధారణ రోజుల్లో బీట్ చూడకపోవడంతో దొంగలు పెట్రేగి పోతున్నారు. ఇటీవల నగరంలో మూలాపేట, కపాడిపాళెంలో రెండు ఇళ్లలో భారీస్థాయిలో దొంగతనాలు జరిగాయి. వీటిలో ఒకటి క్రైం ఎస్ఐ జయరావు ఇల్లు కావడం విశేషం. దొంగలు ఆయనింట్లో పడి షుమారు ఏడు లక్షల రూపాయల విలువైన నగలు, నగదు తస్కరించారు. ఇక చైన్ స్నాచింగ్‌లు, బ్యాంకుల వద్ద దొంగతనాలు షరా మామూలే అవుతున్నాయి. ప్రభుత్వ జీతం తీసుకొనే పోలీసుల కంటే చిన్న మొత్తాలకు విధులు నిర్వహించే గుర్ఖాలే నయం అన్న వాదనలు వినిపిస్తున్నాయి.

## నగరంలోనూ బైక్‌రేస్‌లు!



నెల్లూరు శివార్లలో బైక్‌రేస్‌లు.

మితిమీరిన వేగం, నిర్లక్ష్యం కారణంగా తరచూ ప్రమాదాలు చోటుచేసుకొంటుండడం, పలువురు ప్రాణాలు కోల్పోతుండడం తెలిసిందే. ఇంత జరుగుతున్నా యువతలో మార్పు రావడం లేదనేందుకు కొత్తగా నగరంలో జరుగుతున్న బైక్‌రేస్‌లే ఉదాహరణ. హైదరాబాద్ తదితర నగరాలకే పరిమితమైన ఈ జాడ్యం ఇప్పుడు నగరానికి దిగుమతి అయ్యింది. మహానగరాల్లో ఈ బైక్‌రేస్‌ల కారణంగా పలువురు ప్రాణాలు కోల్పోతున్నారు. ముఖ్యంగా ప్రముఖుల పిల్లలు ఈ రేసుల్లో మృతి చెందిన ఘటనలు అనేకం. ఈ పరిస్థితుల్లో అసలే నగరంలో గాడి తప్పుతున్న ట్రాఫిక్‌కు తోడు బైక్‌రేస్‌లు రావడంతో నగర వాసుల్లో ఆందోళన వ్యక్తమవుతోంది. నారాయణ ఇంజనీరింగ్ కాలేజీ సమీపంలోని బ్రిడ్జి వద్ద, గొలగమూడి క్రాస్ రోడ్డు, చిల్డ్రన్స్ పార్కు రోడ్డు సమీపంలో జాతీయ రహదారిపై ఈ రేసులు జరుగుతున్నట్లు సమాచారం. నిత్యం సాయంత్రం వేళల్లో కొందరు యువకులు కొత్త మోటార్ బైక్‌లను తీసుకొని వచ్చి ఫీట్లు చేస్తున్నారు. ఆదివారాల పూట జరిగే రేస్‌లకు ప్రక్క జిల్లాల నుంచి యువకులు వచ్చి పాల్గొంటున్నట్లు తెలుస్తోంది. ఈ రేస్‌లపై అధిక మొత్తంలో బెట్టింగ్‌లు పెడుతున్నారట. జాతీయ రహదారిపై వేగంగా వెళ్తున్న వాహనాల ప్రక్కనే రేసర్లు చేసే ఫీట్లు చూసే వారికి వణుకు పుట్టిస్తున్నాయి. ఈ ప్రాంతాల్లో పెట్రోలింగ్ నిర్వహించే మొబైల్ పోలీసులకు ఇవేమీ పట్టకపోవడం పట్ల విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ఘోర ప్రమాదం జరిగి ప్రాణాలు కోల్పోయినప్పుడు మాత్రం ప్రత్యేక నిఘా పెడుతున్నామని చెప్పే పోలీసుల తీరు చేతులు కాలాక ఆకులు పట్టుకొన్న చందంగా ఉంటోంది. ఇప్పటికైనా గత అనుభవాలు, గుణపాఠాలను దృష్టిలో ఉంచుకొనైనా బైక్ రేస్‌లను అరికట్టాలని నగర వాసులు కోరుకొంటున్నారు.

## ఇకపై వ్యాపారులపై బాదుడు...

### ట్రేడ్ లైసెన్సు ఫీజు పెంచనున్న కార్పొరేషన్!

ఇటీవలే ఇంటి పన్నులను భారీగా పెంచి ప్రజలపై అధిక భారంమోపిన నెల్లూరు కార్పొరేషన్ వ్యాపారులనూ వదలడం లేదు. ట్రేడ్ లైసెన్సు ఫీజును పెంచే యోచనలో ఉండడం చిన్నాచితకా వ్యాపారులను కలవరపెడుతోంది. ఈ ఫీజు ఇంటి పన్నుల మాదిరిగానే మూడింతలు పెరగనుండడంతో వ్యాపారులు ఆందోళన చెందుతున్నారు. మూడేళ్లకు ఒకసారి ట్రేడ్ లైసెన్స్ ఫీజును పెంచే అధికారం కార్పొరేషన్‌కు ఉంది. సాధారణంగా కౌన్సిల్ ఆమోదంతో ఇలాంటి ఫీజులు పెరగాల్సి ఉండగా, పాలకవర్గం లేకపోవడంతో ప్రభుత్వ ఆదేశాలతో ఈ ఫీజును పెంచేందుకు అధికారులు సిద్ధమవుతున్నారు. 2009 సంవత్సరంలో ఒకసారి ఈ ట్రేడ్ లైసెన్స్ ఫీజును పెంచారు. అప్పటి వరకు 15 లక్షల రూపాయలు వసూలయ్యే మొత్తం పెంచడం వల్ల 38 లక్షల రూపాయలకు పెరిగింది. ఈ ఏడాది మూడింతలు పెరగనుండడంతో దాదాపు 60 లక్షలకు పైగా వసూలు కానున్నట్లు సమాచారం. ఫీజు పెంపుదల విషయమై నగరంలో సంబంధిత విభాగ అధికారులు సర్వే పూర్తిచేశారు. గతంలో కంటే షాపుల సంఖ్య భారీగా పెరిగింది. చిన్న చిన్న వ్యాపారాలు నిర్వహించే అంగళ్ల దగ్గర్నుంచి పెద్ద అంగళ్లు, షాపులు, హోటళ్లు, కళ్యాణ మండపాలు, మెడికల్ షాపులు, ఇతర వ్యాపారాలు నిర్వహించే అన్నీ కలిపి 4,220 వరకు ఉన్నట్లు అధికారుల సర్వేలో తేలిందట. వీటిని ఎ, బి, సి అనే మూడు కేటగిరీలుగా విభజించి షాపింగ్ మాల్‌లు, రెస్టారెంట్లు, కళ్యాణ మండపాలను 'ఎ' కేటగిరి క్రిందకు, మధ్యతరగతి వ్యాపారులను 'బి' కేటగిరి క్రిందకు, చిన్న చిన్న దుకాణాలు నిర్వహించే వ్యాపారులు, బంకులను నడిపే వారిని 'సి' కేటగిరి క్రిందకు తెచ్చి కొత్తగా ఫీజులను వసూలు చేయాలనుకున్నారు. మార్చి నుంచి ఈ పెంపుదల అమలులోకి రానుంది. పెంపు సబబే అయినా ఇంటి పన్నుల విషయంలో మాదిరిగానే ఇబ్బడిముబ్బడిగా వీటిని పెంచనుండడం పట్ల వ్యాపారులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

## ఎన్టీఆర్‌కు సాటిరారు!

● వర్ధంతి సభలో నేతల నివాళి



సభలో మాట్లాడుతున్న సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి.

తెలుగు జాతి కీర్తిప్రతిష్టలను దశదిశలా చాటి చెప్పి, ప్రజల హృదయాలలో సుస్థిర స్థానం సంపాదించుకొన్న విఖ్యాత సినీ కథానాయకుడు, దివంగత మాజీ ముఖ్యమంత్రి నందమూరి తారక రామారావు 16వ వర్ధంతి వేడుకలు జనవరి 18వ తేది వాడవాడలా ఘనంగా జరిగాయి. పట్టణం, పల్లె అన్న తేడా లేకుండా జిల్లా నలుమూలలా వర్ధంతిని నిర్వహించారు. నగరంలో నర్తకి సెంటర్‌లో అఖిల భారత ఎన్టీఆర్ అభిమాన సంఘం అధ్యక్షుడు, మాజీ మంత్రి తాళ్లపాక రమేష్‌రెడ్డి ఆధ్వర్యంలో అట్టహాసంగా జరిగింది. తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేసిన ఈ కార్యక్రమంలో ఎన్టీఆర్ విగ్రహానికి పూలమాలలు వేసి ఘన నివాళులు అర్పించారు. సోమిరెడ్డి మాట్లాడుతూ పేదల అభ్యున్నతికి ఎన్నో సంక్షేమ పథకాలను ప్రవేశపెట్టిన ఘనత ఎన్టీరామారావుదేనని కొనియాడారు. బీసీలు, మహిళలకు రాజకీయ రంగంలో ఎంతో ప్రాధాన్యత ఇచ్చారన్నారు. రమేష్‌రెడ్డి తన సహజ సిద్ధమైన ధోరణిలో నందమూరి వంశ కీర్తి ప్రతిష్టలను తెలియజెప్పారు. సినీ రంగంలో తిరుగులేని యశస్సును సంపాదించి, రాజకీయాల్లోకి ప్రవేశించి పార్టీని స్థాపించిన తొమ్మిది నెలలకే అధికారంలోకొచ్చిన ఘనత ఎన్టీఆర్‌కే సొంతం అన్నారు. నందమూరి వంశాన్ని ఢీకొనే సత్తా ఎవరికీ లేదన్నారు. అనంతరం అన్నదాన కార్యక్రమం నిర్వహించారు. వర్ధంతి సందర్భంగా రమేష్‌రెడ్డి ఏర్పాటుచేసిన ఎన్టీఆర్ పెద్ద కటౌట్‌లు ఆకట్టుకొన్నాయి. మురళీ ఆర్ట్స్ ఆధ్వర్యంలో ఎన్టీఆర్ చిత్రగీతాలతో పాట కచ్చేరి నిర్వహించారు. ఈ కార్యక్రమంలో తెలుగుదేశం పార్టీ నేతలు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, నూనె మల్లిఖార్జున యాదవ్, కిలారి వెంకటస్వామినాయుడు, అంచల వాణి తదితరులు పాల్గొన్నారు.

● వీఆర్‌ఓ, వీఆర్‌ఏ పోస్టులకు

## కుప్పలు తెప్పలుగా దరఖాస్తులు

వీఆర్‌ఓ, వీఆర్‌ఏ పోస్టులకు సంబంధించి వేల సంఖ్యలో దరఖాస్తులు వచ్చాయి. ఈ రెండు పోస్టులకు ఉద్యోగాల భర్తీ కోసం దరఖాస్తులను ఆహ్వానించగా 24,137 దరఖాస్తులు రావడం అధికారులను ఆశ్చర్యానికి గురి చేసింది. హోదా తక్కువ అయినా ప్రభుత్వ ఉద్యోగం కావడంతోపాటు, వయసు సడలింపు ఇవ్వడంతో పదులు, వందల సంఖ్యలో ఉన్న వీఆర్‌ఓ, వీఆర్‌ఏ పోస్టులకు వేల సంఖ్యలో దరఖాస్తులొచ్చాయి. వీఆర్‌ఓ ఉద్యోగానికి సంబంధించి 26 పోస్టులు, వీఆర్‌ఏ ఉద్యోగానికి 255 పోస్టులు భర్తీ చేయనున్నారు. దీనికిగాను వీఆర్‌ఓ పోస్టుకు 17,385 దరఖాస్తులు, వీఆర్‌ఏ పోస్టుకు 6,254 దరఖాస్తులు రాగా 498 మంది అభ్యర్థులు మాత్రం రెండు పోస్టులకు దరఖాస్తుచేసి ఉన్నారట. రాత పరీక్షల్లో వచ్చే మార్కులను ప్రామాణికంగా తీసుకొని భర్తీచేసే ఉద్యోగులకు ఇంజనీరింగ్ చదివిన వారు కూడా దరఖాస్తు చేసుకొన్నారట. గతంలో ఎన్నడూ లేనివిధంగా ఈ పోస్టులకు వేల సంఖ్యలో దరఖాస్తులు రావడం ఉద్యోగం కోసం నిరుద్యోగులు పడుతున్న ఆత్రుతను తెలియజేస్తోంది.

## స్వర్ణవేదిక ఐదవ వార్షికోత్సవం



సుబ్రహ్మణ్య స్వామి కళ్యాణంలో స్వర్ణవేదిక అధినేతలు.

నెల్లూరు పోలీసాఫీసు రోడ్డులోని స్వర్ణవేదిక కళ్యాణ మండపం ఐదవ వార్షికోత్సవ వేడుకలు 21వ తేది ఘనంగా జరిగాయి. ఈ సందర్భంగా సుబ్రహ్మణ్యస్వామి కళ్యాణం కన్నుల పండుగగా జరిగింది. స్వర్ణవేదిక అధినేతలు రాజా శ్రీనివాసరావు, మల్లిఖార్జునరావు, హజరత్ బాబు, చందలూరి రాజశేఖర్, నూకల శేషయ్య గుప్త దంపతులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# నెల్లూరు సెంట్రల్ జైలులో ఖైదీల జల్సా!

శిక్ష అనుభవించాల్సిన ఖైదీలు జల్సాలు చేస్తున్నారు. అధికారులను సంతృప్తిపరిస్తే చాలు ఏది కోరితే అది వారి ముంగిట వాలి పోతుంది. క్షణికావేశాలకులోనై వివిధ నేరాలు చేసి శిక్షకు గురికాబడిన ఖైదీలను సంస్కరించాల్సిన జైలు అధికారులు వాటికి ఏనాడో తిలోదకాలిచ్చేశారు. ఎక్కువ కాలం శిక్షపడిన ఖైదీలు కొందరు ఒక ముఠాగా ఏర్పడి అధికారులు తమకు అనుకూలంగా వ్యవహరించే విధంగా ఒప్పందం కుదుర్చుకున్నారు. ఖైదీలకు అనుకూలంగా వ్యవహరించేందుకు వారి బంధువుల నుంచి భారీ మొత్తంలో ముడుపులు స్వీకరిస్తున్నారన్న ఆరోపణలున్నాయి.

## జైలు బయట టిఫిన్

నగరంలో ఉన్న జిల్లా జైలు నుంచి ప్రతి రోజు కొందరు ఖైదీలను వివిధ పనుల నిమిత్తం బయటకు తీసుకొస్తుంటారు. జైలు ఆవరణలో ఉన్న కూరగాయలు, ఆకుకూరల తోటల్లో వీరి చేత ఉదయం 7 గంటల నుంచి సాయంత్రం 5 గంటల వరకు పనులు చేయిస్తుంటారు. ఈ పనులు చేసేందుకు 11 మంది ఖైదీలు వస్తుంటారు. వీరికి రక్షణగా ఒక వార్డర్‌ను నియమించారు. కాపలాగా నియమించిన వార్డర్ ఖైదీలను వదిలేసి సొంత పనులపై వెళ్తుంటాడు. తోట పనిచేసే ప్రాంతంలో భద్రత లోపించి ఖైదీలు పారిపోయేందుకు అనుకూలంగా ఉంటుంది. మూడడుగుల ప్రహరీగోడ ఖైదీలు పారిపోకుండా ఎలా కాపాడగలుగుతుందో జైలు అధికారులకే తెలియాలి. ఈ 11 మంది ఖైదీలు జైలు బయట ఉన్న దుకాణంలో టిఫిన్ చేస్తారు. ఈ దుకాణం నిర్వహించే మహిళ ఖైదీలకు అవసరమైన సిగరెట్లు, గుట్కాలు, మద్యం సరఫరా చేస్తుంటుంది.

## మద్యం సేవిస్తున్న ఖైదీలు

ఖైదీలను వారి సంబంధీకులు కలిసేందుకు వచ్చిన సమయంలో నగదును జైలు అధికారుల వద్ద డిపాజిట్ చేయడం ఆనవాయితీ. బయట అవసరాలు తీరాలంటే అధికారులు నగదు ఇచ్చేందుకు వీలుపడదు. ఎక్కువ కాలం శిక్షపడడం, బయట పనులు చేయిస్తుండడం వల్ల జైలు సమీపంలో ఉన్న దుకాణాల నిర్వాహకులతో ఖైదీలకు పరిచయాలు బాగా పెరిగాయి. దీంతో వివిధ అవసరాల నిమిత్తం టిఫిన్ దుకాణం నిర్వహించే మహిళ వద్ద వేల రూపాయలు నగదును దాచిపెడుతుంటారు. కొన్ని సమయాల్లో బిరియాని ప్యాకెట్లు, మద్యం కూడా ఈ మహిళ ద్వారానే తెప్పించుకుని ఆమె నివాసంలోనే సేవిస్తుంటారన్న ప్రచారం ఉంది. ఒక డిప్యూటీ జైలర్ బయట పనిచేస్తున్న 11 మంది ఖైదీల వద్దకు వచ్చిన సమయంలో ఇద్దరు కనిపించలేదు. దీంతో సమీప దుకాణంలో తనిఖీ చేయడంతో మద్యం సేవిస్తూ పట్టుబడ్డారట. ఈ సంఘటనను ఉన్నతాధికారి దృష్టికి తీసుకెళ్లినా పెద్దగా పట్టించుకోలేదంటే ఆ అధికారి ఖైదీల పట్ల ఎలా వ్యవహరిస్తున్నాడో అర్థం చేసుకోవచ్చు. జిల్లా కోర్టుకు అతి సమీపంలోని కూరగాయల తోటలో పనిచేస్తున్న ఖైదీలు వ్యవహరిస్తున్న తీరు కోర్టుకు వివిధ పనుల నిమిత్తం వచ్చేవారు చూస్తూనే ఉంటారు. ఎటువంటి జాగ్రత్తలు తీసుకోకపోవడం, కాపలా సిబ్బంది లేకుండా ఖైదీలను బయటకు వదిలేయడం చూసి ముక్కున వేలేసుకుంటున్నారు. జిల్లా జైలును ఉన్నతాధికారులు సక్రమంగా తనిఖీ చేయకపోవడంతో జైల్లో చట్టవిరుద్ధమైన కార్యకలాపాలు మరింత మితిమీరి పోతున్నాయి.



నిత్యం వివాదాల్లో నెల్లూరు సెంట్రల్ జైలు.

## ఓపెన్ జైలు పనులతో స్వేచ్ఛ

ఇదిలా ఉండగా వెంకటాచలం మండలం చెముడుగుంట సమీపంలో ఉన్న ఓపెన్ ఎయిర్ జైలు వద్ద పనిచేసే ఖైదీలు, చికిత్స పేరిట ఆస్పత్రుల్లో చేరిన వారు మరోవిధంగా విలాసవంతంగా గడుపుతున్నారు. ఓపెన్ ఎయిర్ జైలు వద్ద రోజుకు 40 మంది ఖైదీలు పనులు చేస్తున్నారు. వీరికి కాపలాగా ఇద్దరు వార్డర్లు, ఒక డిప్యూటీ జైలర్ ఉంటారు. ఓపెన్ జైలు ఉన్న ప్రాంతం నిర్మానుష్యంగా ఉంటుంది. ఖైదీలు తప్పించుకు పారిపోతే వారి వెంటపడి పట్టుకునే అవసరమైన సిబ్బంది కూడా ఇక్కడ లేరు. సరైన బందోబస్తు లేకుండానే ఖైదీలను తరలిస్తున్నారు. మొక్కలు నాటడం, రోడ్లు శుభ్రం చేయడం, పిచ్చి మొక్కలను తొలగించడం, నిర్మాణాలను చేపట్టడం వంటి పనుల్ని ఖైదీల చేత చేయిస్తున్నారు. నగరానికి దూరంగా ఈ జైలు నిర్మించడం ప్రస్తుతం ఇక్కడ పనులు చేసే వారికి ఎంతో ప్రయోజనకరంగా మారింది. రాత్రి సమయంలో కూడా ఖైదీలను ఇక్కడే ఉంచడంతో వీరిని కలిసే వారి సంఖ్య రోజురోజుకు పెరుగుతోంది. ఈ జైలు వద్ద ఖైదీలను కలుసుకునే విషయంలో ఎటువంటి నిబంధనలు లేకపోవడంతో కుటుంబసభ్యులు సైతం ప్రతిరోజు వచ్చిపోతూనే ఉన్నారు. నగరానికి దూరంగా ఉండడంతో ఇక్కడ జరిగే వ్యవహారాలు అధికారులకు తెలియదన్నది సిబ్బంది ధీమా. జైలు నుంచి అధిక సంఖ్యలో ఖైదీలను తరలించే సమయంలో ముందు జాగ్రత్తగా ఎ.ఆర్ పోలీసులను బందోబస్తు కోసం నియమిస్తుంటారు. జైలు అధికారులు కోరితేనే పోలీసు శాఖ సిబ్బందిని పంపుతుంది. ఓపెన్ ఎయిర్ జైలు వద్ద పనులు నిర్వహించే ఖైదీల విషయంలో బందోబస్తు ఏర్పాటుచేయాలని జైలు అధికారులు కోరకపోవడం విశేషం.

## పెద్దాసుపత్రిలో జల్సా

వైద్య చికిత్స పేరిట జిల్లా ప్రభుత్వాసుపత్రుల్లో చేరే ఖైదీల ఆర్థిక పరిస్థితిని బట్టి ఇక్కడ అన్ని సదుపాయాలు అందుతుంటాయి. జైలు అధికారులను సంతృప్తి పరిస్తే నెలల తరబడి ఆస్పత్రిలోనే ఉంచుతుంటారన్న అభియోగం ఉంది. సంపన్న వర్గాలకు చెందినవారు రిమాండ్ ఖైదీగా వస్తున్నాడంటే అనారోగ్యం పేరుతో ఆస్పత్రికి తరలించేందుకు జైలు అధికారులు సిద్దంగా ఉంటారు. దీనికి తోడు రాజకీయ సిఫార్సులు కూడా వెళ్తుంటాయి. ఆస్పత్రిలో ఖైదీలకు ప్రత్యేక విభాగం కేటాయించినప్పటికీ రిమాండ్ ఖైదీల మాదిరి సాధారణ ఖైదీలు సైతం సివిల్ డ్రస్సులో బయట తిరుగుతుండడం అందరూ చూస్తూనే ఉంటారు. ఆస్పత్రిలోని ఖైదీల విభాగంలో జరుగుతున్న తంతు గురించి వైద్యుల దగ్గర నుంచి జైలు అధికారుల వరకు అందరికీ తెలుసు. అయినా ఎవరు కూడా నిబంధనల ప్రకారం నడుచుకొనేందుకు ప్రయత్నాలు చేయడం లేదు. ఆరోగ్యం సరిగా వున్నా బాగాలేదన్న సాకుచూపి ఆస్పత్రికి పంపాలంటూ జైలు వైద్యులపై అధికారులు ఒత్తిడి తెస్తున్నట్లు తెలుస్తుంది. మామూళ్లకు అలవాటుపడిన అధికారులు ఖైదీల సంక్షేమాన్ని పూర్తిగా విస్మరించి సంపన్న వర్గాలకు చెందిన ఖైదీలు జల్సాలు, విందులు, వినోదాలు చేసుకునేందుకు సహకరిస్తున్నారు. బయటకన్నా వారికి జైల్లోనే అన్నీ జరిగిపోవడంతో సంతోషంగా ఉంటున్నారు. ఇప్పటికైనా జైళ్ల శాఖ అధికారులు స్పందించి నెల్లూరు జైల్లో జరుగుతున్న వ్యవహారాలపై దృష్టిసారించాల్సిన అవసరం ఉంది.

# అల్లూరు ఆదిశేషారెడ్డి ఔదార్యం!



గూడూరులో ఆసరాలేని వృద్ధులకు అల్లూరు ఆదిశేషారెడ్డి ట్రస్ట్ నేతృత్వంలో సాయం అందజేస్తున్న దృశ్యం.

కుటుంబ సభ్యుల ప్రేమాభిమానులకు దూరమైన వృద్ధులను ఆదుకొనేందుకు గూడూరు రోటరీ క్లబ్ ఆధ్వర్యంలో అల్లూరు ఆదిశేషారెడ్డి రోటరీ హెల్పేజ్ కార్య క్రమాన్ని నిర్వహించారు. జనవరి 10వతేది స్థానిక రోటరీ క్లబ్‌లో జరిగిన ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన

## గూడూరులో నెలనెలా వృద్ధులకు సాయం

గూడూరు డిఎస్పీ సురేష్‌కుమార్ మాట్లాడుతూ నిర్లక్ష్యానికి గురైన పెద్దలను గుర్తించి వారికి నెలనెలా బియ్యం, పప్పులు తదితర నిత్యావసర సరుకులను క్రమం తప్పకుండా అంద జేస్తున్న ఆదిశేషారెడ్డి వదాన్యతను అభినందించారు. డిఆర్‌డబ్ల్యు కాలేజి రిటైర్డ్ లెక్చరర్ దేవసేనమ్మ మాట్లాడుతూ దాదాపు 70 మంది పెద్దలకు నిరంతరం సహాయమందిస్తూ వారికి బాస టగా నిలుస్తున్న ఆదిశేషారెడ్డి స్ఫూర్తిదాయకులన్నారు. తమ వంతు సహాయంగా 25వేల రూపాయల విరాళాన్ని ప్రకటిం చారు. అనంతరం దొడ్డ రుక్మిణమ్మ రోటరీ స్కాలర్‌షిప్స్ పేరిట 15 మంది ఇంజనీరింగ్ విద్యార్థులకు ఆర్థిక సహాయాన్ని అం దించారు. ఈ కార్యక్రమంలో రోటరీక్లబ్ ప్రెసిడెంటు దయాకర్ రెడ్డి, సెక్రటరీ రాఘవరెడ్డి, కన్వీనర్ జానకిరామ్‌రెడ్డి, దశరథ రామిరెడ్డి, ప్రసాద్‌రెడ్డి, మునిగిరీష్, చంద్రశేఖర్‌రెడ్డి, సుందర రామిరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### మాదాల, కంభంపై

# వంటేరు గరం గరం!

సాధారణంగా రాజకీయ ప్రత్యర్థులపై ఎలాంటి విమ ర్శలు చేయని కావలి మాజీ శాసనసభ్యుడు వం టేరు వేణుగోపాలరెడ్డి ఇటీవల తన బాణికి భిన్నంగా పరుష పదాలతో తీవ్ర విమర్శలు చేస్తుండడం ఆయన అభిమానులను సైతం ఆశ్చర్యపరుస్తోంది. తెలుగుదేశం పార్టీ తరపున టిక్కెట్ ఇచ్చి ఎన్నికల్లో పోటీ చేయిస్తే మాదాల జానకిరామ్, కంభం విజయ రామిరెడ్డిలు పార్టీని భ్రష్టుపట్టించారని, క్యాడర్‌ను దెబ్బతీశారని ఆరోపించారు. వారి వలన తాను కార్యకర్తలకు దూరం అయ్యే పరిస్థితి ఏర్పడిందన్నారు. ఇటీవల ఉదయగిరికి వచ్చిన ఆయన

## పార్టీని భ్రష్టుపట్టించారని విమర్శ

పలు అంశాలపై మాట్లాడారు. కంభం, మాదాల తెలుగుదేశం పార్టీని వదలి కాంగ్రెస్ పంచన చేరడాన్ని విమర్శించారు. ఉదయ గిరికి జరుగబోయే ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ తప్పక విజయం సాధిస్తుందన్న ధీమా వ్యక్తం చేశారు. పార్టీ అభ్యర్థి బొల్లినేని రామా రావు విజయానికి శాయశక్తులా కృషి చేస్తానని హామీ ఇచ్చారు. పనిలో పనిగా మేకపాటి సోదరులపైనా విమర్శలు గుప్పించారు. పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి, శాసన సభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి ప్రజలకు చేసిందేమీ లేద న్నారు. తమ మనుగడ కోసం జగన్ ఇంటి చుట్టూ ప్రదక్షిణలు చేయడం తప్ప ఒక్క అభివృద్ధి కార్యక్రమం చేపట్టిన దాఖలాలు లేవని విమర్శించారు. ఎన్ని శక్తులు అడ్డుపడినా రామారావు విజయాన్ని ఆపలేరన్నారు.

### ● చిల్లకూరులో

# మత్స్యకారుల ఆందోళన

## కండలేరు క్రీక్‌లోకి వేస్ట్ వాటర్

చిల్లకూరు మండలంలోని తమ్మినపట్నంలో ఏర్పాటవు తున్న థర్మల్ విద్యుత్ ప్లాంటు ఏర్పాటుపై మత్స్యకారులు తీవ్ర ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. దీని కోసం ఇప్పటికే భూములు కోల్పోయి అన్ని విధాలా నష్టపోయిన వీరికి కొత్త సమస్యలు ఎదురౌతుండడంతో తల్లడిల్లిపోతున్నారు. థర్మల్ విద్యుత్ ప్లాంటుకు సంబంధించి నీటిని శుద్ధి చేసే విభాగం ఏర్పాటు పట్ల తీవ్ర వ్యతిరేకత వ్యక్తమవుతోంది ఈప్రాంత ప్రజల్లో. దీనికోసం అవసరమైన నీటిని కండలేరు క్రీక్ నుంచి తీసు కొని నీటిని శుద్ధి చేసి వేస్ట్‌వాటర్‌ను తిరిగి సముద్రంలోకి వదిలిపెట్టాల్సి వుంది. కానీ ఇక్కడ విద్యుత్ ప్లాంటు ఏర్పాటు చేస్తున్న యాజమాన్యం మాత్రం నీటిని సముద్రంలోకి వద లక కండలేరు క్రీక్‌లోకే వదులుతుండడంతో మత్స్యసంప దకు పెనుముప్పేర్పడిందని ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. వేస్ట్‌వాటర్ వేడిగా వుంటోందని చెప్తున్నారు. ఇప్పటికే ఆ యాజమాన్యం క్రీక్ వద్ద డ్రెడ్జర్ సహాయంతో మట్టిని తొలగి స్తున్నది. దీనివల్ల సముద్ర ముఖద్వారం పూడిపోయే ప్రమా దముందని, మత్స్యసంపద క్రీక్‌లోకి వచ్చే పరిస్థితి లేకుండా పోతోందని మత్స్యకారులు ఆందోళనబాట పట్టారు. విద్యుత్ పరిశ్రమల ఏర్పాటు సమయంలో ఉపాధి అవకాశాలను కల్పిస్తామని ఇచ్చిన హామీని నిలబెట్టుకోలేక పోయిందని, ఇప్పుడు మత్స్యసంపదకు, తమ జీవనోపాధికి తీవ్ర విఘా తం కలిగే ప్రమాదమేర్పడిందని వారు వాపోతున్నారు.

# సమస్యలతో సతమతం!

బోగోలు పంచాయితీ బాగోగులు పట్టించుకొనే వాడే లేకుండాపోవడంతో పరిస్థితి అస్తవ్యస్తంగా తయారైంది. అధికారులు పట్టించుకోక, స్పెషల్ ఆఫీసర్లు పంచాయితీ మోహం చూడకపోవడంతో ప్రజల సమస్యలు పట్టించుకొనే నాధుడే లేకుండా పోయాడు. పంచాయితీ అభి వృద్ధికి ఒక్క రూపాయి నిధులు విడుదల చేయని అధికారులు కనీసం ప్రజలకు కనీస సౌకర్యాలు కల్పించడంలోనూ విఫల మవుతున్నారనేందుకు మంచినీటి సమస్యే ఉదాహరణ. గతంలో అరకొరగా మంచినీటి సరఫరా చేసే అధికారులు ఇటీవల కొంతకాలంగా ఆ మాటే మార్చిపోవడంతో పంచా యితీలోని ప్రజలు నీటి కోసం పాట్లుపడాల్సి వస్తోంది. సాధా రణంగా పంచాయితీని మూడు భాగాలుగా చేసి నీటి సరఫరా జరపాల్సి వుంది. బజారువీధి, అరవపాళెం, యాదవ పాళానికి నీటిని అందించాల్సి వుండగా ఎప్పుడో ఏడాదికో శివరాత్రి అన్న చందంగా కొద్దిసేపు నీటిని వదలి తమ పనైపోయిందని చేతులు దులుపుకొంటుండడంతో ప్రజల అవసరాలకు తగినంత నీరు

## బోగోలువాసుల సమస్యలు తీరేదెన్నడు?

అందకుండా పోతోంది. మూలిగే నక్కపై తాటికాయపడిన చందంగా అక్రమ మోటారు కనెక్షన్లు వున్నవారు ఆ నీటిని లాగేస్తుండడంతో సామాన్యులకు నీరు అందడం లేదు. పన్నుల వసూళ్లకు మాత్రం ముందుండే అధికారులు ఇవేమీ పట్టించు కోకపోవడం పట్ల ప్రజలు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు.



స్వర్గీయ ఎన్టీరామారావు వర్ధంతిని పురస్కరించుకొని కావలిలో ఏర్పాటుచేసిన శిబిరం వద్ద ఆయన ఫోటోకు పూలమాలవేసి నివాళులర్పిస్తున్న ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు, పూనూరు రవికుమార్‌రెడ్డి.

# వైఎస్ పథకాలకు మంగళం!

పేదల సంక్షేమం కోసం వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేపట్టిన పథకాలన్నింటిని ప్రస్తుత ప్రభుత్వం నిర్వీర్యం చేస్తోందని నెల్లూరు పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజమోహన్ రెడ్డి విమర్శించారు. విడవలూరు మండలంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి నల్లపు రెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి చేపట్టిన పాదయాత్రలో ఆయన పాల్గొని ప్రసంగించారు. పేద పిల్లల ఉన్నత చదువులకు వైఎస్ ప్రవేశపెట్టిన ఫీజు రీఎంబర్స్‌మెంటు నిధులు మం జూరు చేయకుండా ప్రభుత్వం వారి భవిష్యత్తును నాశనం చేస్తున్నదన్నారు. ఢిల్లీ పెద్దల ఆశీస్సులతో ముఖ్యమంత్రి పీఠంపై కూర్చొన్న వ్యక్తికి రాష్ట్ర ప్రయోజనాలు పట్టడం లేదని విమర్శించారు. వైఎస్ ఆశయాల సాధన కోసం పార్టీని స్థాపించిన జగన్మోన్ రెడ్డిపైనే ప్రజలు ఆశలు పెట్టుకున్నారని, జగన్ పాలన కోసం నిరీక్షిస్తున్నారని తెలిపారు. తెంగాణలోనూ జగన్‌కు విశేష స్పందన లభిస్తున్నదన్నారు. ఏప్రెల్ నెలలోపు కోవూరు

## ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి విమర్శ

ఉప ఎన్నికలు రావడం ఖాయమని, ఆ ఎన్నికల్లో ప్రసన్నకు వేసే ప్రతి ఓటు వైఎస్ రాజ శేఖర్‌రెడ్డికి వేసినట్లేనన్న విషయాన్ని గుర్తించుకొని ప్రసన్నకుమార్‌రెడ్డిని అఖండ మెజా ర్టీతో గెలిపించాలని కోరారు. కోవూరు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి నల్లపురెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి మాట్లాడుతూ నియోజకవర్గ అభివృద్ధికి విశేష కృషి చేశానన్నారు. వైఎస్ఆర్ విడవలూరు మండలం వచ్చినపుడు మత్స్యకార గ్రామాలకు 13 కోట్ల రూపాయలు మం జూరు చేయించిన విషయాన్ని గుర్తు చేశారు. కొందరు నేతలు నోట్లకట్టలతో ఓటర్లను మభ్యపెట్టేందుకు వస్తున్నారని, అలాంటి వారికి తగిన బుద్ధి చెప్పి తనను గెలిపించాలని కోరారు. ఈ కార్యక్రమంలో ప్రసన్న సోదరుడు నల్లపురెడ్డి రాజేంద్రకుమార్‌రెడ్డి, కుమా రుడు రజిత్‌కుమార్‌రెడ్డి, విడవలూరు మండల వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకులు కొండూరు సుబ్బారెడ్డి, వీరి చలపతి, మల్లు సుధాకర్‌రెడ్డి, ఖజావలి, నాగేశ్వరరావు తది తరులు పాల్గొన్నారు.

# ఏసిబికి దొరికిన తహశీల్దార్!

పట్టాదారు పాసుపుస్తకాల కోసం రెండు వేల రూపాయలు లంచం తీసు కొంటూ ఏసిబి అధికారులకు పట్టుబడింది కలిగిరి తహశీల్దార్ శ్యామలమ్మ. మండ లానికి చెందిన పడమరగుడ్లదొనకు చెందిన పోలుబోయిన శ్రీనివాసులు పట్టాదారు పాసుపుస్తకాల కోసం కాళ్లరిగేలా ఎమ్మార్వో కార్యాలయం చుట్టూ తిరుగుతున్నాడట. రెండు వేల రూపాయలు ఇవ్వందే పాసు పుస్తకాలు ఇవ్వనని తహశీల్దార్ తెగేసి చెప్పడంతో, గత్యంతరం లేని పరిస్థితిల్లో బాధితుడు ఏసిబి అధికారులను ఆశ్రయిం చాడు. వాళ్లు పకడ్బందీగా పథకం పన్ని ఆ ప్రకారం బాధితుడి ద్వారా తహశీల్దార్ అడిగిన మొత్తాన్ని ఇచ్చి పంపడంతో అటెండర్ శ్రీనివాసులు ఆ మొత్తాన్ని తీసుకొని తహశీల్దార్ శామలమ్మకు ఇచ్చే సమయంలో అధికారులు రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకు న్నారు. ఈ సంఘటనతో కార్యాలయ సిబ్బంది ఉలిక్కిపడ్డారు. గత కొంతకాలంగా ఈ కార్యాలయంపై అవినీతి ఆరోపణలు వస్తున్న నేపథ్యంలో ఏసిబి అధికారుల దాడులు సంచలనం రేపింది. తహశీల్దార్, అటెండర్‌పై కేసులు నమోదు చేసిన అధికారులు కార్యాలయంలోని పలు కీలక రికార్డులను స్వాధీనం చేసుకున్నట్లు సమాచారం. గతంలో ఆమె కావలి పౌరసరఫరాలశాఖ అధికారిగా వున్న సమయంలో రేషన్ బియ్యం 1500 బస్తాలు దొరకగా, తెల్లారేసరికి కేవలం 150 బస్తాలే కన్పించడంపై అప్పట్లో తీవ్రస్థాయి ఆరోపణలు వచ్చాయి. ఈ నేపథ్యంలో తహశీల్దార్‌గా వున్న ఆమె లంచం కేసులో పట్టుబడడం విశేషం.



బోగోలులోని కుమ్మరివీధి యూత్ ఆర్గనైజేషన్ నేతృత్వంలో జరిగిన పోటీల్లో విజేతలకు బహుమతులందజేస్తున్న మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి.

# కురుగొండ్లపై రుసరుస!

● ఏకపక్ష నిర్ణయాలు వద్దన్న పార్టీ కార్యకర్తలు



తెలుగుదేశం పార్టీ వెంకటగిరి నియోజకవర్గస్థాయి సమావేశం ఇటీవల స్థానికంగా జరిగింది. ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ హాజరైన ఈ కార్యక్రమంలో పలువురు నేతలు, కార్యకర్తలు ఎమ్మెల్యే పనితీరుపై బహిరంగంగానే అసంతృప్తి వ్యక్తం చేశారు. ఏకపక్ష నిర్ణయాలు తీసుకొంటున్నారని, నియోజకవర్గంలో వివిధ కార్యక్రమాలకు హాజరయ్యే సందర్భంలో సీనియర్ నాయకులకు సమాచారం అందించకుండా తిరగడాన్ని తప్పుపట్టారు. రెండేళ్లలో శాసనసభ ఎన్నికలు, త్వరలో స్థానిక సంస్థల ఎన్నికలు జరుగనున్న దృష్ట్యా ఈ విధానం సరైనది కాదని ఎమ్మెల్యే ముఖంపైనే చెప్పారు. తమకే కాదని, పార్టీ వర్గాల్లోనూ అసంతృప్తి ప్రబలుతోందని తెలిపారు. దీనిని నివారించాల్సిన అవసరం ఎంతైనా వుందన్నారు. పార్టీ నేతలు, కార్యకర్తలు మాట్లాడిందంతా విన్న కురుగొండ్ల స్పందిస్తూ ఈ అసంతృప్తిని చల్లార్చేందుకు చర్యలు చేపడుతానన్నారు. మండలస్థాయి నేతలతో స్టాండింగ్ కమిటీలు ఏర్పాటు చేస్తామన్నారు. ఆ కమిటీల సూచనల మేరకే ఆయా మండలాలపై దృష్టి సారిస్తానని హామీ ఇచ్చారు. ఇకపై పార్టీ శ్రేణుల అభిప్రాయాలకు అనుగుణంగానే నడుచుకొంటానని రామకృష్ణ స్పష్టం చేయడంతో సమావేశం ప్రారంభంలో కొంత అసంతృప్తితో వున్న నేతలు ఎమ్మెల్యే హామీతో సంతోషపడ్డారు.

# ధ్వంసమైన రోడ్లు!

● జయంపు - అలిమిలి మధ్య ప్రయాణం కష్టం

బాలాయపల్లి మండలంలో జయంపు – అలిమిలి గ్రామాల మధ్య రహదారులు పూర్తిగా ధ్వంసమై పోయి వున్నాయి. వెందోడు పరిసర ప్రాంతాల నుంచి నిత్యం అధికసంఖ్యలో కంకరలోడ్‌తో వాహనాలు తిరుగుతుండడంతో ఆ ధాటికి రోడ్లు ఛిద్రం అయ్యాయి. నడుములు విరిగేలా రోడ్లు గుంటలు పడి వుండడంతో ఈ మార్గం గుండా రాకపోకలు సాగించేవారు నరకయాతన పడుతున్నారు. దీనికి తోడు దుమ్ము విపరీతంగా లేస్తుండడంతో ఈ ప్రాంతాల ప్రజలు పడుతున్న ఇబ్బందులు అన్ని ఇన్ని కావు. రోడ్లు రోజురోజుకు ధ్వంసమై పోతుండడంతో విసిగిపోయిన గ్రామస్తులు కంకర వాహనాల రాకపోకలను అడ్డుకొన్నారు. విషయం తెలుసుకొన్న బాలాయపల్లి ఎస్ఐ మంజన్ సాహెబ్ వచ్చి గ్రామస్తులకు నచ్చ జెప్పారు. వాహనాలు తిరిగే విషయంపై ఉన్నతాధికారులకు తెలియజేసి తగిన చర్యలు తీసుకుంటామని హామీ ఇవ్వడంతో వారు శాంతించారు. ఇప్పటికే చుట్టుప్రక్కల ప్రాంతాల్లో క్వారీల యజమానులు గ్రానైట్ త్రవ్వకాలకు కొండలను పేల్చేస్తుండడం వలన ఆ శబ్దాలకు ఇళ్లు బీటలు వారుతున్నాయని, రాళ్లు వచ్చి పడుతున్నాయని ఈ పరిస్థితుల్లో కొత్త సమస్యలు తమను చుట్టుముట్టుతున్నా అధికారులు పట్టించుకోవడం లేదని ఆరోపిస్తున్నారు.

● విడవలూరులో

# ఇందిరమ్మ ఇళ్లు ఘోరం!

విడవలూరులో పేదప్రజల కోసం ప్రభుత్వం నిర్మించి ఇచ్చిన ఇందిరమ్మ ఇళ్ల కాలనీలలో మౌలిక వసతులు కరువయ్యాయి. గుంటలు మిట్టలుగా వున్న రోడ్లపై నడవడానికి కష్టతరంగా వుంటోంది. వీధిలైట్లు లేక, మురికి నీళ్లు ప్రవహిస్తూ చూసేందుకే అపరిశుభ్ర వాతావరణం నెలకొని వుండడంతో ఆ ఇళ్లను నిర్మించుకొన్న ప్రజలు పడుతున్న బాధలు అన్ని ఇన్ని కావు. 2005వ సంవత్సరంలో

## మౌలిక వసతుల కరవు

ఎస్సీ, ఎస్టీ, బిసి కులాలకు చెందిన షుమారు 200 మందికి పైగా లబ్దిదారులు ఇక్కడ ఇళ్లను ఏర్పచుకొన్నారు. ఆనాటి నుంచి ఇప్పటి వరకు మౌలిక సదుపాయాలను కల్పించడంలో అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడంపై స్థానికులు మండిపడుతున్నారు. మంచినీటి సౌకర్యం లేక, మరుగుదొడ్ల వసతి లేక తాము కొన్నేళ్లుగా ఇబ్బందులు పడుతున్నా పట్టించుకొనేవారే లేకుండా పోయారని, దీనిపై పలుమార్లు అధికారులను కలసి విన్నవించుకొన్నా ఫలితం లేకుండా పోయిందని వాపోతున్నారు.

# పరసాను నిలదీసిన మహిళలు

## మాటలతో మాయచేసి తప్పించుకొన్న ఎమ్మెల్యే.

తన మాటలతో అందరిని ఆకట్టుకొని ఎలాంటి వారినైనా ఇట్టే ఆకర్షించే సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసారత్నంకు చేదు అనుభవం ఎదురైంది. ఇటీవల దొరవారి సత్రం మండలంలో తీరప్రాంత గ్రామాలైన కారికాదు, వైఎస్ఆర్ నగర్ ప్రాంతాల్లో జరిగిన ముగ్గుల పోటీలకు పరసా హాజరయ్యారు. స్థానిక మహిళలు ఎమ్మెల్యే వచ్చిన వెంటనే చుట్టుముట్టి ఘేరావ్ చేశారు. మంచినీటి సమస్యతో సతమతం అవుతున్నా పట్టించుకొనే వారే లేకుండా పోయారని ఆగ్రహం వ్యక్తం చేశారు. దీనిపై సమాధానం చెప్పాలని గట్టిగా మాట్లాడారు. మహిళలు ఒక్కసారిగా ఈ విధంగా ఘేరావ్ చేయడం ఊహించని పరిణామానికి ముందు ఆయన నిశ్చష్టుడైనప్పటికీ, తేరుకొని తనదైన శైలిలో ఎడాపెడా హామీలివ్వడమే కాక అప్పటికప్పుడే అధికారులతో మాట్లాడి సమస్యను తక్షణం పరిష్కరించాలని చెప్పడంతో మహిళలు శాంతించారు.

# సారా వూట ధ్వంసం

## సాహసం చేసిన ఎక్సైజ్ సిబ్బంది

వెంకటగిరి కొండ క్రింది ప్రాంతాల్లో నాటుసారా కేంద్రాలపై ఎక్సైజ్ పోలీసులు దాడులు చేశారు. సంక్రాంతి పండుగను పురస్కరించుకొని సారా తయారీ అధికంగా వుండడంతో అధికారులు ఎట్టకేలకు లంచాల మత్తు వదిలించుకొని దాడులు చేయడం విశేషం. వెంకటగిరి, రాపూరు, గూడూరు, నాయుడుపేట ప్రాంతాల్లో గాలింపు చర్యలు జరిపిన ఎక్సైజ్ సిబ్బంది దాచెరువు, పాళెం కోట, కుర్జాగుంట తదితర ప్రాంతాలలో 1800లీటర్ల బెల్లం ఊటను గుర్తించి ధ్వంసం చేశారు. ఎక్సైజ్ సూపరింటెండెంట్ వేణుగోపాల్ ఆధ్వర్యంలో ఈ దాడులు జరిగాయి. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అక్రమ నాటుసారా తయారీదారులపై పిడియాక్టు ప్రయోగిస్తామని హెచ్చరించారు.

# ఎలుకల నివారణ మందులేవీ?

వ్యవసాయశాఖ ప్రతి సంవత్సరం అందించే ఎలుకల నివారణ మందులను రైతులకు అందించలేక చేతులెత్తేసింది. ప్రభుత్వం రైతులకు అందించే ఒక్క పథకాన్ని నీరుగారుస్తూ మరికొన్నింటికి మంగళం పాడిన వ్యవసాయశాఖ చివరకు రైతులకు ఇచ్చే ఎలుకల నివారణ మందును సరఫరా చేయలేక పోవడం ఆశాఖ వైఫల్యాన్ని తెలియజేస్తుంది. ఎలుకల బారి నుంచి పంటనష్టం జరుగకుండా వుండేందుకు రైతుల నుంచి నూకలు తీసుకొని సమపాళ్లలో మందు కలిపి ఇచ్చేవారు. ఈ మందునే వాడితే ఎలుకల బారి నుంచి కొంతమేర విముక్తి కల్గేది రైతులకు. అయితే ఈ మందులను ఇవ్వకుండా పోవడంతో రైతులు ఇబ్బందులు పడుతున్నారు. ముఖ్యంగా తోటపల్లి గూడూరు, ఇందుకూరుపేట, ముత్తుకూరు, మనుబోలు, వెంకటాచలం ప్రాంత రైతులు ఎలుకల దెబ్బకు తీవ్రంగా నష్టపోతున్నారు. గ్రామాల్లో పనిపాట లేకుండా వున్న ఆదర్శ రైతుల ద్వారానైనా ఎలుకల మందును సరఫరా చేయించాలని రైతులు కోరుతున్నారు.

● వెంకటగిరి

# వరదరాజస్వామి ఆలయ జీర్ణోద్ధరణ!

వెంకటగిరిలో శతాబ్దాల క్రితం నిర్మించిన వరదరాజస్వామి ఆలయ జీర్ణోద్ధరణ పనులు చేపట్టారు. గత కొన్నేళ్లుగా ఈ ఆలయం శిథిలావస్థకు చేరుకొంటోంది. చెన్నైకు చెందిన టివిఎస్ కంపెనీ ఈ బాధ్యత స్వీకరించింది. కంపెనీ అధినేత వీణ శ్రీనివాసన్ 1.5 కోట్ల రూపాయలతో ఆలయ జీర్ణోద్ధరణ పనులు ప్రారంభిస్తున్నట్లు ప్రకటించారు. టివిఎస్ అనుబంధ సంస్థ అయిన వేణుగోపాలస్వామి కైంకర్యం ట్రస్టు దేవాదాయశాఖ అనుమతి తీసుకొని ఈ పనులు ప్రారంభించారు. వాస్తు, ఆగమ శాస్త్రం నిబంధనల ప్రకారం ఈ జీర్ణోద్ధారణ పనులు జరుగుతున్నాయి. ఎంత ఖర్చయినా వెనుకాడక ఆలయాన్ని పూర్తిస్థాయిలో పునఃనిర్మిస్తామని దాతలు ప్రకటించారు. కోట్లరూపాయలు వెచ్చించి ఆలయ జీర్ణోద్ధరణ పనులు చేపట్టిన టివిఎస్ కంపెనీ నిర్వాహకులను గ్రామస్తులు అభినందిస్తున్నారు.

# అందని పంట రుణాలు

## తిప్పకొంటున్న బ్యాంకులు

కౌలు రైతులకు ప్రభుత్వం ఇస్తామని చెప్పిన పంట రుణాలు అందని ద్రాక్షలా మారాయి. రుణం కోసం సంబంధిత రుణార్హత కార్డులను తీసుకొని బ్యాంకుల చుట్టు కాళ్లరిగేలా తిరుగుతున్నా ప్రయోజనం వుండడం లేదు. బ్యాంకు అధికారులు లేని పోని అనుమానాలతో కౌలు రైతులను నెలల తరబడి తిప్పుకొంటున్నా, రుణం దొరుకుతుందేమోనన్న ఆశతో రోజు పనులు మానుకొని బ్యాంకుల చుట్టూ ప్రదక్షణలు చేయాల్సి వస్తోంది. ఖరీఫ్ సీజన్‌లోనూ పంట రుణాలు అందని కారణంగా అధికవడ్డీకి ప్రైవేట్ వ్యక్తుల నుంచి రుణాన్ని పొందాల్సి వస్తోందని రైతులు వాపోతున్నారు. ఇంత చేసి పంట సాగుచేసినా చేతికందుతుందన్న నమ్మకం లేకుండా పోవడం, గిట్టుబాటు ధర లేని కారణంగా ఆర్థికంగా నష్టపోతున్నామని కన్నీళ్ల పర్యంతం అవుతున్నారు కౌలు రైతులు. ప్రభుత్వం ప్రకటించిన పంట రుణాలు సక్రమంగా కౌలు రైతులకు అందేలా ఉన్నతాధికారులు చర్యలు చేపట్టాల్సి వుంది.

## పదవి ఊడినా బుద్ధిమారని 'శంకర్రావ్''



చేనేతమంత్రి శంకర్రావును మంత్రిపదవి నుంచి బర్తరఫ్ చేసినా ఆయన బుద్ధి మాత్రం మారటం లేదు. శంకర్రావును మంత్రిపదవి నుంచి తొలగించడానికి సిఎం కిరణ్ చాలానే కష్టపడ్డాడు. ఈమేరకు అధిష్టానం మంత్రి పదవికి రాజీనామా చేయాల్సిందిగా శంకర్రావును కోరింది. అయితే శంకర్రావు మాత్రం రాజీనామా చేయలేదు. దీంతో శంకర్రావును మంత్రి పదవి నుంచి తొలగించాల్సిందిగా సిఎం స్వయంగా గవర్నర్‌కు లేఖ రాశారు. ఆ తర్వాత ఆగమేఘాల మీద శంకర్రావును బర్తరఫ్ చేశాడు గవర్నర్. పదవి ఎలాగుపోయింది కాబట్టి చివరి నిముషం వచ్చిన వరకు రాబట్టుకోవాలనుకున్నాడో ఏమోగానీ ముఖ్యమైన ఫైళ్లను తన దగ్గరే వుంచుకున్నాడు. ఇందులో ఉద్యోగుల ప్రమోషన్ ఫైళ్లు కూడా వున్నాయి. చేతులు తడిపితేనే వెనుక తేదీలతో ప్రమోషన్లు ఇస్తానంటూ శంకర్రావు కబురు పెట్టాడట. పాపం! ప్రమోషన్ల కోసం కక్కుర్తిపడి ఉద్యోగులు శంకర్రావుకు భారీగానే ముట్టచెప్పారు. పదవి పోయినా కూడా బుద్ధి మారడం లేదంటూ శంకర్రావు గురించి సచివాలయంలో చెవులు కొరుక్కుంటున్నారు.

## నలిగిపోతున్న సినీ పరిశ్రమ



రాజకీయాల్లో ప్రత్యర్థులుగా మారి వేడి పుట్టిస్తున్న చిరంజీవి, బాలకృష్ణ వైరం సినీపరిశ్రమ మీద కూడా ప్రభావం చూపుతోందట. సినీపరిశ్రమలో వర్గాలు ఎప్పటి నుంచో వున్నాయి. అయితే తాజా పరిణామాలతో ఈ వర్గాలు క్రియాశీలంగా మారుతున్నాయట. సినీప్రపంచంలో కులాల కుమ్ములాటలు సహజమే. ప్రస్తుత పరిస్థితుల్లో కమ్మ, కాపు కులస్తులు బహిరంగంగానే తలపడే ప్రమాదముందని సినీ పండితులు చెబుతున్నారు. చిరంజీవి కాంగ్రెస్‌తో మిలాఖత్ అయిన నాటి నుంచి స్వరం పెంచాడు. చిరును ధీటుగా ఎదుర్కోటానికి చంద్రబాబు కూడా బాలకృష్ణను తెరపైకి తెచ్చాడు. బాలకృష్ణ ప్రస్తుతం సినిమాల్ని తగ్గించుకొని రాజకీయాలపైనే దృష్టి పెడుతున్నాడు. కొన్ని రోజులుగా రాష్ట్రంలోని పలుప్రాంతాల్లో పర్యటిస్తూ చిరంజీవిపై తీవ్ర విమర్శలు చేస్తున్నాడు. చిరు – బాలయ్య మధ్య జరుగుతున్న రాజకీయ యుద్ధాన్ని సినీవర్గాలు తమ ప్రయోజనాలకు అనుగుణంగా వాడుకుంటున్నాయి. దీనివల్ల ముందు ముందు తెలుగు సినీపరిశ్రమ రెండుగా చీలిపోయే ప్రమాదముందంటున్నారు. చూద్దాం... ఏం జరుగుతుందో!

## జగన్‌కు ఉక్కబోత



సిబిఐ విచారణతో వైఎస్ జగన్ ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. జగన్ ఆస్తులకు సంబంధించి ఇప్పటికే జగన్ ఆడిటర్ విజయసాయిరెడ్డిని జైలుకు పంపింది సిబిఐ. దీంతో జగన్‌కు చేతులు కట్టేసినట్లయింది. జగన్ జోలికి పోకుండా జగన్ చుట్టూ పొగ బెడుతోంది సిబిఐ. దీంతో జగన్‌కు ఉక్కబోత ఎక్కువైంది. ప్రస్తుతం గుంటూరు జిల్లా ఓదార్పు యాత్రలో వున్న జగన్ మనసంతా సిబిఐ విచారణపైనే వుంది. సిబిఐ వ్యవహారశైలి అంతుబట్టక జగన్ బిత్తరపోతున్నాడు. ఇప్పటిదాకా ఎలాగోలా నెట్టుకొస్తూ గుంభనంగా వుంటున్న జగన్ ప్రవర్తనలో మార్పు కనిపిస్తోంది. తనపై కక్షసాధిస్తున్నారని, ఇంతకంటే కాల్చి చంపినా మేలేనంటూ దిగజారి మాట్లాడుతున్నాడు. జగన్ వైఖరికి వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీ వర్గాలు ముక్కున వేలేసుకుంటున్నాయి. నాయకులే అస్త్రసన్యాసం చేస్తే ఇక తమ సంగతేమిటని? పెదవి విరుస్తున్నారు. పాపం జగన్! కింకర్తవ్యమ్ అంటూ ఆలోచనలో పడ్డాడు.

## రోశయ్యకు పదవీ గండం?



తమిళనాడు గవర్నర్ రోశయ్యకు పదవీ గండముందా? త్వరలోనే రోశయ్య అమీర్‌పేట భూముల కుంభకోణం ఉచ్చులో చిక్కుకపోక తప్పదా? అంటే అవుననే అంటున్నాయి ఎసిబి వర్గాలు. రోశయ్య ముఖ్యమంత్రిగా వున్నప్పుడు హైదరాబాదులోని అమీర్‌పేట ప్రభుత్వ భూముల కేటాయింపు జరిగింది. సుమారు 200 కోట్ల రూపాయలు విలువ చేసే ఈ భూముల కేటాయింపును రోశయ్య తనకు కావాల్సిన వారికి కట్టబెట్టారన్న ఆరోపణలు వచ్చాయి. దీనిపై అవినీతి నిరోధకశాఖ విచారణ కూడా జరిపింది. విచారణ నివేదికను ప్రభుత్వానికి అప్పజెప్పక ముందే రోశయ్య పాత్ర ఏదీ లేదంటూ ఎసిబి ప్రకటించింది. దీనిపై ఒక న్యాయవాది కోర్టు కెళ్లడంతో ఈ వ్యవహారాన్ని తిరిగి విచారించాలంటూ ఎసిబిని కోర్టు ఆదేశించింది. దీనిపై ఎసిబి కేసును తిరగదోడింది. ఈ కేసు విచారణలో సంబంధిత ఐఎఎస్ అధికారులు బిపి ఆచార్య, అప్పారావు తమకేం సంబంధం లేదని, అంతా రోశయ్య లీల అంటూ వాఙ్మూలం ఇచ్చారు. దీంతో కేసులో నిందితుడైన రోశయ్య తప్పించుకోవడం కష్టమేనంటున్నారు. ఒకవేళ రోశయ్య మెడకు ఈ కుంభకోణం ఉచ్చు తగులుకుంటే మాత్రం ఆయన గవర్నర్ పదవికి గండం కలగొచ్చు పాపం! రోశయ్య ఇదంతా ఊహించి ఉండకపోవచ్చు అంటూ రాజకీయులు చెవులు కొరుక్కుంటున్నారు.






స్వర్ణభారత్ ట్రస్ట్‌లో 'రిపబ్లిక్ దే'ను పురస్కరించుకొని జాతీయ పతాకాన్ని ఆవిష్కరిస్తున్న ఎం.వెంకయ్య నాయుడు.




నెల్లూరులో వస్త్ర దుకాణాల బంద్‌ను పురస్కరించుకొని నగరంలో ప్రదర్శన చేస్తున్న వస్త్ర వ్యాపారులు.



చింతగింజలపై జాతీయ నాయకుల చిత్రాలను చిత్రీకరిస్తున్న నెల్లూరు చిత్రకారుడు అమీర్‌జాన్.

# ఉత్తరాయణ ప్రవేశాన్ని తెలియజేసే రథసప్తమి!



లోక బాంధవుడు, గ్రహాలకు అధిపతి, ప్రత్యక్ష నారాయణుడు అయిన సూర్యభగవానుని జన్మ తిథి మాఘశుద్ధ సప్తమిని రథసప్తమిగా జరుపుకొంటారు. ఇతర మాసాల్లో వచ్చే సప్తమి తిథి కన్నా మాఘమాసంలో వచ్చే శుద్ధసప్తమి విశేషమైనది. ఆ రోజు నుంచి భానుడి కిరణాలు భూమికి మరింత దగ్గరగా వస్తాయని చెప్తారు. సమస్త జీవులకు వెలుగు రేఖలను ప్రసాదించే సూర్యభగవానుని ఆరాధించడం వలన ఆయురారోగ్యాలు సిద్ధిస్తాయని పురాణాలు చెప్తున్నాయి. అలాంటి ఆదిత్యుని ఆరాధన ప్రధానంగాసాగే పండుగే రథసప్తమి. ఏడు అశ్వాలు కల్గిన ఏకచక్ర రథంపై పద్మంపై కూర్చున్న సూర్యనాయణుడు ఉత్తరాయణంలోకి ప్రవేశించడాన్ని తెలిపేదే రథసప్తమి. సూర్యగమనం ప్రధానంగా రెండు రకాలుగా వుంటుంది. ఉత్తరాయణం, దక్షిణాయణం. ఆషాఢ మాసం నుంచి పుష్యమాసం వరకు దక్షిణాయణంలో వుండే సూర్యుడు ఆ తర్వాత దిశ మార్చుకొని మకరరాశిలోకి ప్రవేశిస్తాడు. ఆనాటి నుంచి ఉత్తరాయణం ఆరంభమవుతుంది. ఉత్తరాయణ ప్రవేశాన్ని తెలియజెప్పేదే రథసప్తమి.

కశ్యపమహర్షి, అదితి దంపతులకు విష్ణుమూర్తి అనుగ్రహంతో జన్మించినవాడు సూర్యుడు. ఆయన రవి, భానుడు, భాస్కరుడు, సవిత, వివస్వత, సర్వాత్మక, సహస్ర కిరణ్, గభస్తిమాన్, ఆదిత్య అనే నామాలతో ప్రసిద్ధుడు. సూర్యునికి చాయాదేవి, సంజ్ఞాదేవి అనే ఇరువురు భార్యలు. శనీశ్వరుడు, యముడు, యమున తదితరులు సంతానం. అన్ని జీవుల పట్ల సమదృష్టి కల్గివుండడం ఆదిత్యుని ప్రత్యేకత. ఆరోగ్య ప్రదాత, మహాశక్తిమంతుడు, సకల శాస్త్ర పారంగతుడు అయిన సూర్యభగవానుని ఆరాధిస్తే చక్కని విద్యాబుద్ధులు లభిస్తాయని, సర్వరోగాలు తొలగి ఆరోగ్యం ప్రాప్తిస్తుందని నవగ్రహ పురాణం చెబుతోంది. రామరావణ సంగ్రామంలో బలం క్షీణించి నిరాశ నిస్పృహలో వున్న రామచంద్రుడికి అగస్త్యమహర్షి ఆదిత్య హృదయాన్ని ఉపదేశిస్తాడు. ఆ దివ్యశ్లోకాలను పఠించిన శ్రీరామునికి సూర్యుని శక్తి లభించి సర్వశక్తిమంతుడై యుద్ధంలో రావణుని సంహరించి విజయం సాధించేందుకు కారణమైనట్లు రామాయణ మహాకావ్యం పేర్కొంది. దీనిని బట్టి ఆదిత్య హృదయం ఎంత శ్రేష్టమైనదో తెలుస్తుంది. రథసప్తమినాడు ఉషోదయాన్నే సూర్యునికి ఇష్టమైన అర్కపత్రాల (జిల్లేడు ఆకులు)తో స్నానమాచరించాలి. ఏడు ఆకులను తల భుజాలు, మోచేతులపై వుంచుకొని స్నానం చేసినట్లయితే ఏడు జన్మల పాపాలు తొలగుతాయని చెప్తారు. అంతే కాక ఏడు పత్రాలు సప్తాశ్వాలకు సూచికగాను ధర్మశాస్త్రం చెబుతోంది. సూర్యారాధన అనంతరం పొంగలిని చిక్కుడు ఆకులలో వుంచి నైవేద్యంగా సమర్పించాలి. ఆనాడు గాయత్రి మంత్రాన్ని పఠించినా మంచిదని చెప్తారు. చలిని తగ్గించి కొత్త ఉత్తేజాన్ని, చైతన్యాన్ని కల్గించే రథసప్తమి జనవరి 30న వస్తుంది. ఆనాడు అరసవిల్లి, కోణార్క తదితర సూర్యదేవాలయాల్లో విశేష పూజలు చేస్తారు.



# వారఫలాలు

*తేది 28-01-2012 నుండి 3-02-2012 వరకు మేషంలో గురువు; వృషభంలో కేతువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; మకరంలో రవి, బుధులు; కుంభంలో శుక్రుడు; కుంభ, మీన, మేష, వృషభాలలో చంద్రుడు సంచరిస్తారు.*




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో వున్నవారికి శుభాశుభమిశ్రమంగా వుంటుంది. మనస్తాపం, శరీరారోగ్యలోపం, ఖర్చులు సామాన్యం. వ్యాపారస్తులకు నూతన పెట్టుబడులకు అవకాశం. విద్యార్థులకు, వ్యవసాయదారులకు సంతోషం, మంచి అవకాశాలు వుంటాయి. నూతన వస్తువాహన, భూ రుణ సౌకర్యాలు లభిస్తాయి. ప్రయాణాలు అనుకూలిస్తాయి. తీర్థయాత్రలు చేయగలరు.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఆర్థిక విషయాలు సంతృప్తినిస్తాయి. ఉద్యోగులకు ఉత్సాహం, ప్రోత్సాహకాలు లభిస్తాయి. సామాన్యులకు ప్రభుత్వ కార్యాలలో పనులు సానుకూలిస్తాయి. నూతన గృహ నిర్మాణాది కార్యక్రమాలకు అనుకూలం. బంధుమిత్రుల సహకారం లభిస్తుంది. వ్యవసాయానికి అనుకూలం. విద్యార్థులకు బాగుంటుంది.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో వున్నవారికి అనుకూలంగా వుంటుంది. ఇంటాబయట గౌరవాభిమానాలందుతాయి. శత్రు విజయం. ఇంటియందు వివాహ శుభకార్యాలకు అనుకూలం. తొందరపడి ఇతరులకు హామీలు ఇవ్వవద్దు. నూతన వస్తు, వాహన సౌకర్యం. వ్యవసాయదారులకు సంతోషం. విద్యార్థులకు శుభ సూచికం.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి చాలా అనుకూలమైన కాలం. రావలసిన బాకీలు సకాలంలో వసూలవుతాయి. నూతన గృహ, నిర్మాణాది కార్యక్రమాలకు, ఇంటి యందు శుభకార్యాలకు అనుకూలం. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. లలితకళలలోని వారికి ప్రోత్సాహకరమైన వారం. వ్యవసాయ రంగంలోని వారికి, విద్యార్థులకు శుభఫలితాలు లభిస్తాయి.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి సంతోషకరమైన వారం. ఆరోగ్య సమస్యలు తగ్గుతాయి. కానీ ఇతరులతో ఆచితూచి వ్యవహరించండి. విమర్శలు ఎదుర్కొనవలసి వస్తుంది. వ్యాపారస్తులకు శ్రమానంతరం అనుకూలం. వ్యవసాయ రంగంలోని వారికి ఆదాయాలు అధికం. మొత్తం మీద అందరికి ఆర్థిక పరిస్థితి సానుకూలంగా వుంటుంది.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి కొన్ని సమస్యలకు పరిష్కారం లభిస్తుంది. చిరకాల కోరికలు నేరవేర్చుకోగలరు. తీర్థయాత్రలు, లేదా దూరప్రయాణాలకు అవకాశం కలదు. నిరుద్యోగులకు అనుకూలం. స్త్రీలు కుటుంబ సమస్యలందు జాగ్రత్త వహించాలి. విద్యార్థులకు శ్రమకు తగ్గ ఫలితం వుంటుంది. వ్యవసాయదారులకు అనుకూలం.

## పంచాంగం

30తేది రథసప్తమి. సూర్య జయంతి.
31తేది భీష్మాష్టమి.
1తేది సప్తనందినీ దేవి పూజ. మహానంద నవమి – మాధ్వ నవమీ తిథి
3తేది భీష్మ ఏకాదశి. శ్రీభీష్మ పంచక వ్రతం.

### శుభ ముహూర్తాలు

28, 29, 30, ఫిబ్రవరి 2,3 తేదీలలో వివాహాది, గృహారంభ, గృహప్రవేశాదులకు సుముహూర్తములున్నాయి.

### జనవరి తిథులు
### మాఘ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 28 | శని | పంచమి | ప 03.31 | గం.ల.వ |
| 29 | ఆది | షష్ఠి | సా 04.43 | గం.ల.వ |
| 30 | సోమ | సప్తమి | రా 08.17 | గం.ల.వ |
| 31 | మంగళ | అష్టమి | రా 10.57 | గం.ల.వ |

### ఫిబ్రవరి తిథులు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | బుధ | నవమి | రా 01.27 | గం.ల.వ |
| 2 | గురు | దశమి | రా 03.21 | గం.ల.వ |
| 3 | శుక్ర | ఏకాదశి | తె 04.56 | గం.ల.వ |

అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం
7/34, డిఎస్ఆర్ నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఈ వారం కీడు మేలు కలయికగా వుంటుంది. గతంలో ఆగిన పనులు తిరిగి పుంజుకుంటాయి. బంధుమిత్రుల సహకారముంటుంది. ఇంటియందు మార్పులుంటాయి. వ్యాపారస్తులకు నూతన పెట్టుబడులకు అవకాశం కలదు. వ్యవసాయదారులకు సామాన్యంగా వుంటుంది. విద్యార్థులు ప్రయాణాలు చేసేటప్పుడు తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఈవారం చేసే పనులలో ఆటంకాలు ఏర్పడతాయి. ఇంటియందు సమస్యలు, నిరాశను కలిగిస్తాయి. అకాల భోజనం. స్త్రీలకు ఆరోగ్య లోపం. అధికారుల తీరు వల్ల మనస్తాపం చెందుతారు. విద్యార్థులకు ఫలితం సామాన్యంగా వుంటుంది. వ్యవసాయ రంగంలోని వారికి శ్రమకు తగ్గ ఫలితం లభిస్తుంది.




వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలోని వారికి చాలా అనుకూలమైన కాలం. ఇంటియందు శుభకార్యాలకు బంధుమిత్రుల సహకారం లభిస్తుంది. కార్యసిద్ధి. కానీ ఊహించని అధిక ఖర్చులుంటాయి. ప్రయాణాలు సానుకూలం. సేవా కార్యక్రమాలలో పాల్గొంటారు. వ్యవసాయ రంగంలోని వారికి ఆర్థిక లాభం. విద్యార్థులకు అనుకూలం.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు చేసే పనులు సకాలంలో పూర్తిగావించగలవు. నూతన వస్తు, వాహనాలు సమకూర్చుకొంటారు. ఇంటియందు శుభాధి కార్యక్రమాలకు అనుకూలంగా వుంటుంది. నిరుద్యోగులు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులకు శుభదాయకంగా వుంటుంది. వ్యవసాయ రంగంలోని వారికి ఆర్థిక లాభాలు బాగుంటాయి.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి అనుకూలంగా, ప్రోత్సాహకరంగా వుంటుంది. స్వల్ప యత్నంలోనే పనులు సానుకూలిస్తాయి. చేసే పనులలో మార్పులు తప్పవు. వ్యవసాయం చేసేవారికి నూతనంగా చేసే పనులు అనుకూలిస్తాయి. విద్యార్థులకు మంచి అవకాశాలుంటాయి. వస్త్రాభరణాలు సమకూర్చుకుంటారు. కానీ ఆర్థిక పరిస్థితి సామాన్యంగానే వుంటుంది.




వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలోని వారికి ఆర్థిక చిక్కులు తొలగి లాభకరంగా వుంటుంది. ఇంటియందు శుభకార్య ప్రయత్నాలు అనుకూలిస్తాయి. స్థిరాస్తుల కొనుగోలు ప్రయత్నాలకు అనుకూలం. వస్తు, వాహన సౌకర్యాలు సమకూర్చుకోగలరు. విద్యార్థులకు చాలా అనుకూలమైన వారం. వ్యవసాయ రంగంలోని వారికి ఆర్థికంగా బాగుంటుంది.

# జ్యోతిష శాస్త్రం ఎవరి గుప్పిట్లోనూ ఇమడదు!

*ఎం.జ్ఞానప్రసూన ఉప్పలపాడు*

*★ తీరా కుదురుతుందనుకున్న సంబంధం ఓ పూజారి నిర్వాకం వల్ల ఆగిపోయింది.*

పూజారులైనా, జ్యోతిష సిద్ధాంతులైనా మిడిమిడి జ్ఞానంతో వివాహాలు చెడగొట్టడం విచారకరం. వధూవరులిద్దరిదీ రాక్షసగణమైతే అభ్యంతరమే లేదు. గ్రహ బలం ఉన్నప్పుడు చిన్న కారణాలను పరిగణనలోకి తీసుకోవద్దని 'పూర్వ కాలామృత' గ్రంథం చెబుతోంది.

*ఎస్.అరుణకుమారి కాంచీవరం*

*★ నవరత్న ఉంగరం ధరించాక కొన్నాళ్లు కలసి వచ్చింది. ఆ తర్వాత సమస్యలు వస్తున్నాయి?*

నవరత్న ఉంగర ధారణ వల్ల ప్రయోజనం లేదు. పైగా తిర్యక్రుభావం వల్ల సమస్యలు, సంఘర్షణలు ఎదురవుతాయి జాగ్రత్త!

*సి.లక్ష్మీశారద హైదరాబాద్*

*★ ఎంత సంపాదించినా నిలవడం లేదు. కుమారుడు కూడా స్థిరపడటం లేదు.*

ఉత్తర, తూర్పు దోషాలు, పశ్చిమ వాయువ్య భ్రష్టత ఇందుకు కారణం. కుబేర యంత్ర ప్రతిష్ట చేయండి. సిద్ధాంతికి గృహం చూపించండి.

*ఎర్రంరెడ్డి జీవన్‌రెడ్డి ఉదయగిరి*

*★ యంత్ర ప్రతిష్ట తర్వాత మండలం(నలభై రోజులు) దాటింది. ఏ ప్రభావమూ లేదు.*

'అంగట్లో యంత్రం' శాస్త్రీయంగా తయారయింది కాదు. అది పనిచేయకపోగా సమస్యల్ని తెచ్చి పెడుతుంది. మీపై వచ్చిన అపవాదులు ఈ కారణం వల్లే వచ్చాయి.

*ఆర్.దమయంతీరెడ్డి కడప*

*★ శ్రీవారు యాక్సిడెంటులో గాయపడ్డారు. పుష్యరాగధారణ చేసి సుదర్శన యంత్రం ప్రతిష్టించాక బాగా కోలుకున్నారు.*

రాహు, కేతు ప్రభావాన్ని 'సుదర్శన యంత్రం' గణనీయం తగ్గిస్తుంది. పుష్యరాగం రోగాన్ని త్వరగా నయం చేస్తుంది. భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పండి.

*కె.తిరుపతిరెడ్డి కర్నూలు*

*★ జామ చెట్టును కొట్టాక సమస్యలొచ్చాయి.*

కరివేపాకు కష్టం. మునగ ముదనష్టం. జామ జాడ్యం అని ఎవరు చెప్పారు మీకు? మొదట మీరు ఛాందసులని గుర్తించండి! ఆ తర్వాత మీ బుద్ధి మార్చుకోండి!!

*కె.ప్రత్యూషనాయుడు తిరుపతి*

*★ ఆయన మరణించాక అప్పులున్నాయంటూ పత్రాలు తెస్తున్నారు. ఆర్థిక పరిస్థితి ఛిన్నాభిన్నమయింది.*

తొలుత మీరు న్యాయ సలహా తీసుకోండి. 'సుదర్శన యంత్రం' ప్రతిష్టిస్తే సరిపోదు. మండలం ఒక్కరోజు(41) యంత్రపూజ నిష్టగా చేయాలి. తర్వాత మీ పరిస్థితిని గురించి ఉత్తరం రాయండి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రీనగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఐ.లక్ష్మీమానస నాయుడుపేట*

*★ వర్గు, పక్షి కూటమి, తత్వం, గణన సంఖ్య, జంట స్థితి చూసి వివాహం చేసుకోవాలా?*

అవసరం లేదు. గ్రహబలం బాగుంటే, శత్రు వర్గులో శని, రాహు, కేతు, చంద్రులు రాకుంటే సలక్షణంగా వివాహం చేసుకోవచ్చు.

*జె.వి.శంతనరావు అనంతపురం*

*★ శంఖుస్థాపన తర్వాత ఏయే ముహూర్తాలు పాటించాలి?*

సింహద్వారం, గృహ ప్రవేశాల విషయంలో పాటించాలి. భీములు, స్లాబులకు ఇతరత్రా నిర్మాణాలకు మంచి రోజులు చూడండి. లగ్నబలాలు చూడపనిలేదు!

*వెంకటరమణారెడ్డి ఎ.ఎన్.కండ్రిగ*

*★ నిర్మాణానికి ఉత్తర, దక్షిణాలలో కాలువలున్నాయి. నిర్మాణం సక్రమంగా కొనసాగడం లేదు.*

మీరు పంపిన ప్లానులో చాలా దోషాలున్నాయి. వాటిని సరిచేసుకోవాలి. దక్షిణం యమస్థానం గనుక, సుదర్శన యంత్రం ప్రతిష్టించుకోండి.

*ఎన్.పోతురాజు ఆత్మకూరు*

*★ ఆగస్టు వరకూ ఆర్థిక పరిస్థితి అనూహ్యంగా పెరిగింది. సెప్టెంబరు కోర్టు వ్యాజ్యాల్లో అంతా తుడిచిపెట్టుక పోయింది.*

ఆగష్టు 28తో మీ శుక్రమహర్దశ పూర్తి అయింది. వాస్తు దోషాల్ని మీరు పట్టించుకోక పోవడం వల్ల అవి విజృంభించాయి. లక్ష్మీయంత్రం (శ్రేష్ట) ప్రతిష్టించి చూడండి.



పెన్నావారధి పనుల్లో ప్రగతి ఏది?

• ఆగిపోయిన

# జలయజ్ఞం పనులు!

**జిల్లాలో జలయజ్ఞం ప్రాజెక్ట్‌లో భాగంగా 800 కోట్ల రూపాయల విలువచేసే పనులు చేపట్టను ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. పెరిగిన అంచనాలు, నిధులు విడుదల చేయడంలో ప్రభుత్వం చూపుతున్న ఉదాసీనవైఖరి వల్ల ఎక్కడికక్కడ పనులు నిలచిపోయాయి.**

జిల్లాలో జలయజ్ఞం ప్రాజెక్ట్‌లో భాగంగా చేపట్టిన సాగునీటి ప్రాజెక్టులకు నిధుల కొరత ఏర్పడింది. దీనిలో భాగంగా చేపట్టిన నిర్మాణాలకు అవసరమైన నిధులను ప్రభుత్వం విడుదల చేయకపోవడంతో పనులు పూర్తి కాకుండా పోతున్నాయి. ఫలితంగా ఆయకట్టు రైతులకు సాగునీరు అందకుండా పోయింది. 2007 సంవత్సరంలో ప్రారంభమైన ఈ ప్రాజెక్టు పనులు వివిధ కారణాల చేత పూర్తి కావడం లేదు. తొలుత పనులు దక్కించుకున్న కాంట్రాక్టర్లు గిట్టుబాటు కావడం లేదన్న కారణం చూపి కొన్ని నెలలపాటు పనులు ప్రారంభించ లేదు. అంచనాలను సేకరించి ప్యాకేజి వ్యయాన్ని ప్రభుత్వం పెంచడంతో తిరిగి పనులు ప్రారంభించారు. జిల్లాలో దాదాపు 800 కోట్ల రూపాయల మేర సాగునీటి ప్రాజెక్టులు మంజూరు అయ్యాయి. సంవత్సరాలు గడుస్తున్నా నిర్ణీత సమయానికి కాంట్రాక్టర్లు ప్రాజెక్టులు పూర్తి చేయడం లేదు.

జిల్లాలో ప్రధానమైన సంగం బ్యారేజి నిర్మాణం, పెన్నా బ్యారేజి, కనుపూరు కాల్వ లైనింగ్ పనులకు అధిక శాతం నిధులు కేటాయించింది ప్రభుత్వం. మేజర్, మైనర్, మీడియం ఇరిగేషన్ల పేరుతో పనులను ప్యాకేజీలుగా విభజించడం జరిగింది. ప్యాకేజీలను పూర్తి చేయాల్సిన కాలవ్యవధి దగ్గర పడుతున్న కొద్దీ కాంట్రాక్టర్లు పెరిగిన ధరలకు అనుగుణంగా అంచనా వ్యయాన్ని సవరించాలని ఒత్తిడి తెస్తున్నారు. దీనికితోడు ప్రభుత్వం కూడా జలయజ్ఞం ప్రాజెక్టులకు కేటాయించిన నిధులను విడుదల చేయకుండా తీవ్ర జాప్యం చేస్తుంది. కాంట్రాక్టర్లు చేసిన పనులకు బిల్లులు మంజూరు కాకపోవడంతో పనులు నిలిపివేయాల్సి వచ్చిందని అంటున్నారు. సాగునీటి ప్రాజెక్టుల పనులు త్వరితగతిన పూర్తిచేసి, రైతులకు మరింత ఆయకట్టుకు సాగునీరందించాలన్న ప్రభుత్వ లక్ష్యం నెరవేరకుండా పోయే అవకాశం ఏర్పడింది.

పనులు ప్రారంభించి మధ్యలో నిలిపివేయడంతో రైతులతో పాటు ప్రభుత్వానికి కూడా కొంతమేర నష్టం వాటిల్లింది. మరింత ఆలస్యం జరిగితే అంచనా వ్యయం మార్చాలన్న డిమాండ్ వస్తుంది. ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి బాగా లేకపోవడం వల్ల నిధుల కొరత ఏర్పడింది. నిధుల సమీకరణ జరిగితే తప్ప జలయజ్ఞం ప్రాజెక్టులకు అవసరమైన నిధులు విడుదలయ్యే అవకాశం లేదు. వచ్చే ఆర్థిక సంవత్సరంలోనే ప్రస్తుతం జరిగిన పనులకు చెల్లింపులు జరుపనున్నట్లు తెలుస్తుంది. మరి కొందరు కాంట్రాక్టర్లు ఇప్పటివరకు చేసిన పనులకు బిల్లులు మంజూరు చేయించుకుని ఆ తర్వాత పనులు చేయకుండా వాటిని నిలిపివేయాలన్న అభిప్రాయంతో ఉన్నారు. మేజర్ ఇరిగేషన్ కింద పనులు చేపట్టిన కాంట్రాక్టర్లు గత మూడు నెలల నుంచి పనులు నిలిపివేసి ఉన్నారు. వీరికి నీటిపారుదల శాఖ అధికారులు నోటీసులు జారీచేసినా ఎటువంటి స్పందన రాలేదు.

122.50 కోట్ల రూపాయలతో చేపట్టిన సంగం బ్యారేజి నిర్మాణం పనులకు ఇప్పటివరకు కేవలం 15 కోట్ల రూపాయలు మాత్రమే ఖర్చు చేయగలిగారు. 126.70 కోట్ల రూపాయలతో చేపట్టిన నెల్లూరు బ్యారేజి నిర్మాణ పనులకు 45 కోట్ల రూపాయలు మాత్రమే ఖర్చు చేయడం జరిగింది. పెన్నా డెల్టా ఆధునీకరణ పనులకు 77 కోట్ల రూపాయలు కేటాయించగా రెండు కోట్ల రూపాయలు ఖర్చు చేశారు. ఈ పనులకు కేటాయించిన గడువు ఈ సంవత్సరంతో ముగిసింది. అలాగే 71.64 కోట్ల రూపాయలతో కనుపూరు కాలువ ఆధునీకరణ పనులు చేపట్టగా డిసెంబర్ నాటికి 20 కోట్ల రూపాయల పనులు పూర్తి చేశారు. ఈ పనులు దక్కించుకున్న ఎ.కె.ఆర్ కోస్టల్ కంపెనీ పనులు కొనసాగించేందుకు చొరవ చూపక పోవడంతో ఒప్పందం రద్దుకు అధికారులు ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపారు. ప్యాకేజి – 35 ద్వారా సర్వేపల్లి, కృష్ణపట్నం, ఈదగాలి కాల్వల లైనింగ్ ఏర్పాటు చేయడంతోపాటు సర్వేపల్లి రిజర్వాయర్ అభివృద్ధికి 80.40 కోట్ల రూపాయలు కేటాయించారు.

ఈ పనులను హైదరాబాద్‌కు చెందిన జి.ఎస్.ఆర్ కంపెనీకి అప్పగించడం జరిగింది. 2010 నాటికి పనులు పూర్తి కావాల్సి ఉన్నప్పటికీ కాంట్రాక్టర్ అభ్యర్థన మేరకు 2013 వరకు గడువు పొడిగించారు. సాగునీటి ప్రాజెక్టుల పనులు, కాల్వల ఆధునీకరణ, చెరువుల అభివృద్ధి జరిగితే జిల్లాలో వ్యవసాయ విస్తీర్ణం పెరుగుతుంది. అధికారుల వైఖరి, కాంట్రాక్టర్ల నిర్లక్ష్యం, ప్రభుత్వం అనాలోచిత చర్యల కారణంగా పనులు మొత్తం అసంపూర్తంగా మిగిలిపోయాయి. నిధులు ఎప్పుడు కేటాయిస్తారో, పనులు ఏనాటికి పూర్తి చేస్తారో ప్రభుత్వానికే తెలియాలి.

మంగళం

# సంక్షేమ పథకాలకు త్వరలో మంగళం!

**సంక్షేమ పథకాలకు త్వరలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మంగళం పాడనున్నాయి. ఆర్థిక సంస్కరణల అమలులో భాగంగా ఈ నిర్ణయం తీసుకున్నట్లు సమాచారం.**

సంక్షేమ పథకాలకు త్వరలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మంగళం పాడనున్నాయి. ఆర్థిక సంస్కరణల అమలులో భాగంగానే ఈ నిర్ణయం తీసుకున్నట్లు సమాచారం. సంక్షేమ అభివృద్ధి పథకాల కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కొంత భాగం సబ్సిడీ నిధులు మంజూరు చేస్తున్నాయి. ఈ నిధులను నేరుగా లబ్దిదారులకు నగదు రూపంలో అందించేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. తొలి విడతగా దేశంలో నాలుగు రాష్ట్రాలను కేంద్ర ప్రభుత్వం ఎంపిక చేయడం జరిగింది. ఎంపిక చేయబడిన నాలుగు రాష్ట్రాల్లో మన రాష్ట్రం కూడా ఉంది. దారిద్ర్యరేఖకు దిగువనున్న షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, వెనుకబడిన తరగతుల వారికి ఆయా శాఖల ద్వారా పలు సంక్షేమ పథకాలు అమలు జరుగుతున్నాయి.

ఈ సామాజిక వర్గాలకు చెందిన లబ్దిదారుల పేరిట ప్రత్యేకంగా బ్యాంకు, పోస్టాఫీస్‌లలో ఖాతాను ప్రారంభించి సబ్సిడీ నగదును జమ చేయనున్నారు. తొలివిడతలో ఈ విధానం విజయవంతమైతే దేశవ్యాప్తంగా అమలు చేయాలన్నది కేంద్ర ప్రభుత్వం నిర్ణయం. ఇదే విధానం అమలు జరిగితే సంక్షేమ పథకాలు మంజూరుచేసే అవకాశం ఉండదు. ఎవరైనా పథకం ఏర్పాటు చేయాలనుకుంటే అటువంటి వారికి సబ్సిడీ నిధులు మంజూరు కావు. వారే స్వంతంగా నిధులు భరించాల్సి ఉంటుంది. జిల్లాలో గిరిజన సంక్షేమ శాఖ, ఎస్సీ కార్పొరేషన్, వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖలు సబ్సిడీతో కూడిన పలు పథకాలు మంజూరు చేస్తున్నాయి. 30వేలకు మించకుండా సబ్సిడీ లభిస్తుంది. యూనిట్‌లో మిగిలిన నిధుల్ని బ్యాంకులు సమకూర్చి మంజూరు చేస్తున్నాయి. కొన్ని సంక్షేమ శాఖలకు నిధులు అందకపోవడంతో పథకాలు మంజూరుకాని పరిస్థితి ఏర్పడింది.

ఎన్ని సంక్షేమ పథకాలు మంజూరవుతున్నా అర్హులైన లబ్దిదారులకు అందడంలేదన్న ఆరోపణలున్నాయి. దీంతో లబ్దిదారులకు సబ్సిడీ నగదును నేరుగా అందించాలని సంకల్పించింది ప్రభుత్వం. అలాగే రేషన్ షాపుల ద్వారా సబ్సిడీపై అందిస్తున్న నిత్యావసర సరుకులకు సంబంధించిన నగదును కూడా లబ్దిదారులకు అందించనుంది. ప్రభుత్వం బహిరంగంగా ఈ ప్రకటన చేయనప్పటికీ అధికారులకు మాత్రం సమాచారం అందించినట్లు తెలుస్తుంది. సంక్షేమ పథకాలన్నింటినీ ఒకే గొడుగు కిందకు తీసుకువచ్చేందుకు ముమ్మర ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ తంతు పూర్తిచేసిన తర్వాతనే నగదు బదలీ కార్యక్రమానికి శ్రీకారం చుడతారు. ఇదిలా ఉండగా పేద ప్రజలకు వంట గ్యాస్‌కు అందిస్తున్న సబ్సిడీపై కూడా కోత విధించే అవకాశం కనిపిస్తుంది. రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటివరకు 50 రూపాయలు సబ్సిడీ భరిస్తుంది.

మరి కొద్ది రోజుల్లో ఈ సబ్సిడీని పూర్తిగా ఎత్తివేయనున్నట్లు సంకేతాలు అందుతున్నాయి. ఇదే అమలైతే జిల్లా ప్రజలు మరింత అదనపు భారం మోయాల్సి వుంటుంది. అన్ని వర్గాలకు చెందిన వారికి అందిస్తున్న గ్యాస్ సిలిండర్‌పై ఇస్తున్న సబ్సిడీని పేద ప్రజలకు మాత్రం వర్తింపచేసి సంపన్న, మధ్యతరగతి వర్గాలకు రద్దు చేస్తామని పౌరసరఫరాల శాఖ మంత్రి శ్రీధర్‌బాబు ప్రకటించారు. ప్రజల నుంచి ఇప్పటికే తీవ్ర వ్యతిరేకత వస్తున్న కారణంగా మంత్రి పై ప్రకటన చేయక తప్పలేదు. ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం పట్ల అన్ని వర్గాల వారు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. భవిష్యత్తులో మరిన్ని రాయితీలకు కూడా కోత విధించే అవకాశం లేకపోలేదన్న అభిప్రాయం వ్యక్తం చేస్తున్నారు.

ఆర్థిక భారాన్ని కొంతమేర తగ్గించుకోవాలన్న ఉద్దేశంతోనే ప్రభుత్వం సంక్షేమ పథకాలపై దృష్టి సారించినట్లు కనిపిస్తుంది. సబ్సిడీలపై కోత విధించడం, సంక్షేమ పథకాలకు విడుదలచేసే సబ్సిడీ నగదును నేరుగా అందించే నిర్ణయంపై ఆందోళన చేసేందుకు విపక్షాలు సిద్ధమవుతున్నాయి. ఏదిఏమైనా భవిష్యత్తులో సంక్షేమం అనే పదం వినిపిస్తుందా అనేది సందేహంగా మారింది.

# బాడీగార్డ్ పరవాలేదు!



✍ అల్లూరు రహీం

సినిమాలకు మహరాజ పోషకులు కుటుంబ ప్రేక్షకులు. కాని ఇప్పుడు కుటుంబ సమేతంగా కలసి చూసే చిత్రాలు బాగా తగ్గిపోయాయి. యువ ప్రేక్షకులే టార్గెట్‌గా రొమాన్స్, యాక్షన్, ఫ్యాక్షన్ కథలు తెలుగు తెర మీదకు దూసుకవస్తున్నాయి. సంక్రాంతి పండుగ బరిలో ప్రేక్షకుల ముందుకు వచ్చిన చిత్రం బాడీగార్డ్. ఈ చిత్రానికి మూల మాతృక మళయాళంలో తయారైన బాడీగార్డ్. ఆ తర్వాత 'బాడీ గార్డ్' తమిళం, హిందీలోనూ తయారయ్యింది. సల్మాన్‌ఖాన్ హీరోగా హిందీలో తీసిన బాడీగార్డ్ చిత్రం సూపర్ డూపర్ హిట్ కావడంతో తెలుగులో దీన్ని విక్టరీ వెంకటేష్‌ను హీరోగా పెట్టి తీయను ముందుకొచ్చారు నిర్మాతలు బెల్లంకొండ సురేష్, గణేష్‌బాబులు.




హిందీ చిత్రమంత భారీగా లేకపోయినా వున్నంతలో సంసారపక్షంగా ఈ చిత్రాన్ని తీయను యువ దర్శకుడు గోపీచంద్ మలినేని బాగా శ్రమించాడు. ఇప్పటివరకు డాన్ శీను చిత్రం తీసిన అనుభవమున్న ఈయన మూలకథను రచయిత కోన వెంకట్‌తో కలసి కాస్త మార్చారు. కథను ఫ్యాక్షన్ బ్యాక్‌డ్రాప్ లోకి తీసుకపోవడం, కాస్త కామెడీ ట్రాక్ పెంచడం వంటివి చేశారు. హిందీ బాడీగార్డ్ చిత్రం చూసిన వారికి అది కాస్త స్లోగా నడుస్తున్నట్లు అనిపిస్తుంది. తెలుగు బాడీగార్డ్ మాత్రం స్పీడ్‌గానే నడుస్తాడు. ద్వితీయార్థంలో వెనువెంటనే రెండు పాటలు, ఆడవేషంలో వెంకటేష్, కొన్ని ఫ్రేముల్లో ఆయన ముఖం పూరీలా ఉబ్బినట్లు కనపడడం, చివరన కుమారుడితో ట్రైన్‌లో వస్తూ జమ్మలమడుగు బదలుగా జబల్‌పూర్ అని హిందీ చిత్రంలోలా డైలాగు పలకడం వంటి పొరపాట్లకు బాధ్యత దర్శకుడే స్వీకరించాలి. ఈ చిత్రానికి పెద్ద ప్లస్ పాయింట్ తమన్ సంగీతం. పుట్టగానే అమ్మ ఒడి బాడీగార్డ్, బాడీగార్డ్ చరణాలతో సాగే పాటలకు హిందీ సినిమా ఫక్కీలో సంగీతం కూర్చినా ఎవ్వరో, ఏమో... ఏమో, అడుగడుగునా నినుచూశా పాటలకు మంచి మెలోడిని దట్టించారాయన. ఈ పాటలను రామజోగయ్యశాస్త్రి, అనంత శ్రీరాం మనసుపెట్టి వ్రాశారు. కావాలనుకొన్నా ప్రేమను చరణంతో సాగే పాటలో త్రిష లిప్ మూమెంట్ సరిగ్గా ఇవ్వకపోవడం పెద్ద తప్పిదం. ఆమె హీరోయిన్‌గా నటించిన చిత్రాల్లో ఈ తప్పిదం తరచూ పునరావృతం అవుతుంది. హీరోయిన్‌కు ఇంత పొగరు పనికిరాదు. ఈ చిత్రంలో ఆమె మరీ సన్నగా అయ్యి పేషంట్‌లా కనపడింది. పాటలను చిత్రీకరించిన ప్రకృతి సౌందర్య ప్రదేశాలకు పోటీపడి మరీ కెమెరామెన్ శ్యామ్ కె నాయుడు తన ప్రతిభ చూపాడు. కోన వెంకట్ వ్రాసిన మగోడికి మీసం. ఆడదానికి మోసం. అందం కళ్లకు సంబంధించింది... దానికి మనసుకు సంబంధం లేదు. నిజమైన ప్రేమను దాచడం ఎవరివల్లా కాదు. ప్రేమను దక్కించుకొనేవాడు నిజమైన మగాడు డైలాగులు ఆలోచింపజేస్తాయి.

చిత్రకథలోనికి వెళ్తే జమ్మలమడుగులో ఫ్యాక్షన్ నాయకుడు వరదరాజులు నాయుడు (ప్రకాష్ రాజ్) కుటుంబమంటే వెంకటాద్రి (వెంకటేష్) ప్రాణమిస్తాడు. ఊళ్లోని గొడవలు పైన వేసుకొని తిరుగుతుండే వెంకటాద్రిని అతని మేనమామ మోహన్‌రావు (తనికెళ్ల భరణి) నాయుడు కుటుంబానికి బాడీగార్డ్ అవసరమని జమ్మలమడుగు పంపుతాడు. రాయలసీమ గార్మెంట్స్ నిర్వహణ చూసే కీర్తి (త్రిష) వరదరాజులు నాయుడు కుమార్తె. ఓ రోజు కుటుంబ సమేతంగా గుడికి వెళ్లే వీరిపై ప్రత్యర్థి శివారెడ్డి (కోట శ్రీనివాసరావు) మనుషులు దాడి చేస్తారు. దీంతో నాయుడు తన కన్నా కుమార్తె కీర్తికే బాడీగార్డ్ అవసరమని వెంకటాద్రిని ఆమెకు రక్షణగా వుండమంటాడు. కాలేజీలో బాడీగార్డ్ వల్ల కీర్తి స్వేచ్ఛను కోల్పోతుంది. బాడీగార్డ్ వెంకటాద్రి ట్రాక్ మార్చను ఓ ప్రైవేట్ మొబైల్ నెంబరుతో అతనికి ఫోను చేసి ప్రేమిస్తున్నానంటుంది. ఫోన్లో పలుకరిస్తున్న తీయని కంఠం కీర్తిదని వెంకటాద్రి తెలుసుకోడు. ఓ రోజు కీర్తిని, ఫోన్‌లో ఆమే నిందిస్తే వెంకటాద్రి ఒప్పుకోడు. ఆమె పై తనకున్న భావనను అతను వ్యక్తం చేసిన తీరుకు ముగ్ధురాలైన కీర్తి మనస్ఫూర్తిగా వెంకటాద్రిని ప్రేమిస్తున్నానంటుంది. ఇంతలో ఆమెకు వరుసకు బావ అయిన శంకర్‌నాయుడు (సుబ్బరాజు)తో పెళ్లి కుదురుతుంది. ప్రైవేట్ నెంబర్ ఫోను నుంచే కీర్తి వెంకటాద్రికి ఫోను చేసి ఎట్టైనా వెళ్లిపోదాం బేగంపేట రైల్వేస్టేషన్‌కు రమ్మంటుంది. ఇంతలో ప్రత్యర్థి శివారెడ్డి, తండ్రి వరదరాజులు నాయుడు వచ్చేస్తారు. ప్రక్కపక్కనే వుండే బాడీగార్డ్, కీర్తి చివరికి ఒకటయ్యారా లేదా అనేది వెండితెరపై చూస్తేనే బాగుంటుంది. వెంకటేష్‌కు బాడీగార్డ్ లాంటి పాత్రలు కొట్టిన పిండైనా ఆయన లవర్‌బాయ్‌గా పనికిరాడని ఈ చిత్రంలో చాలా ఫ్రేములు గుర్తు చేస్తాయి. గొప్పగా లేకపోయినా కుటుంబసమేతంగా బాడీగార్డ్‌కు వెళ్లవచ్చు.

# రాణీముఖర్జీకి పెళ్లి!



కంచికి చేరిందనుకొన్న బాలీవుడ్ హీరోయిన్ రాణీముఖర్జీ, ఆదిత్య చోప్రాల ప్రేమకథ ఇప్పుడు మళ్లీ చిగురులు తొడుగుతోంది. వీరిద్దరి మధ్య చాలాకాలం నుంచీ ప్రేమ వ్యవహారం నడుస్తోంది. పెళ్లి మాట ఎత్తేసరికి... వెనక్కి తగ్గేవారు. కొంతకాలంగా ఇద్దరూ అంటీ ముట్టనట్లు వుంటున్నారు. అయితే ఈ బంధం మళ్లీ మొదటికొచ్చింది. ఈ మధ్య పలు కార్యక్రమాలకు ఇద్దరూ కలిసే హాజరవుతున్నారు. ఇరుకుటుంబాల పెద్దలు వీరి పెళ్లి ముహూర్తాలు పెట్టేపనిలో బిజీగా వున్నారట. ఈ విషయాన్ని రాణీ ముఖర్జీ దగ్గర ప్రస్తావిస్తే నాకన్నా మా పెళ్లి విషయం మీకే బాగా తెలుసని చమత్కరించింది.

# హీరోగా అల్లు శిరీష్



ప్రముఖ నిర్మాత అల్లు అరవింద్ మూడో కుమారుడు అల్లు శిరీష్ హీరో అవుతున్నాడు. అయితే ఆయన ఎంట్రీ తెలుగు సినిమా ద్వారా కాదు. తమిళ చిత్రంతో. ప్రభాస్ హీరోగా నటించిన 'మిస్టర్ పర్‌ఫెక్ట్'ను తమిళంలో తెరకెక్కించను సన్నాహాలు చేస్తున్నారు. ఈ సినిమాతో శిరీష్‌ను కథానాయకుడిగా పరిచయం చేస్తున్నారు. ప్రస్తుతం నటీనటులు, సాంకేతిక నిపుణుల ఎంపిక జరుగుతుంది. దర్శకుడు ఎవరనే విషయం త్వరలో తెలుస్తుంది. చెన్నై కేంద్రంగా సౌత్‌స్కోప్ సినిమా పత్రికను నడుపుతున్న శిరీష్ తెలుగులో ఎప్పుడు నటిస్తాడనే విషయం తెలియాల్సుంది.

# రానా స్నేహితుడే...



హీరోయిన్ త్రిష నిరంతరం వార్తల్లో వుంటుంది. లీడర్ ఫేం హీరో రానాతో ప్రేమలో పడిందని, వీరిద్దరూ నూతన సంవత్సర వేడుకలు గోవాలో కలసి చేసుకున్నారని ఫిల్మ్‌నగర్ కోడైకూస్తుంది. ఇదే విషయాన్ని త్రిషను అడిగితే పుకార్లు నాకేం కొత్త కాదు. నాకున్న మంచి మిత్రుల్లో రానా ఒకడు. రాత్రి పొద్దుపోయిన తర్వాత కూడా ఫోన్లో కబుర్లు చెప్పుకొనేంత స్నేహం మాది. దీనికి లింకులు పెడితే ఎలా? ప్రస్తుతం ఎన్టీఆర్ సరసన దమ్ము చిత్రంలో నటిస్తున్నాను. తెలుగు పరిశ్రమలో నాస్థానం ఏమిటని ఎప్పుడూ ఆలోచించలేదు. ఎందుకంటే ఇక్కడ ఓ మంచి సినిమా చేస్తే చాలు... ప్రేక్షకుల మనసులో చెరిగిపోని స్థానం సంపాదించుకోవచ్చుంది.

# ఒకే సినిమాలో నమిత, ముమైత్!



సెక్సీభామలు నమిత, ముమైత్‌ఖాన్ ఒకే చిత్రంలో కలసి నటిస్తున్నారు. ఈ చిత్ర దర్శకుడు పోసాని కృష్ణమురళి. ఆయన తీర్చి దిద్దే కథల్లోని పాత్రలు కాస్త తిక్కగా, ఇంకొంచెం గందరగోళంగా కనిపిస్తాయి. దొంగ స్వాముల భరతం పట్టే కథతో ఆయన బొంగుస్వామి చిత్రాన్ని రూపొందిస్తున్నారు. స్వామి పోసాని సేవలో తరించే కథానాయికలుగా నమిత, ముమైత్‌ఖాన్‌లు నటిస్తున్నారు. త్వరలోనే ఈచిత్రం సెట్స్ మీదకు వెళ్తుంది.



# అనవసర విషయాల్లో వేలు పెట్టను!



తానొక సినిమాను అంగీకరించే ముందు ఆచిత్రంలో తన పాత్ర ఎలా వుంటుందనేది మాత్రం వాకబు చేస్తానే తప్ప మిగతా విషయాలు పట్టించుకోనంటుంది హీరోయిన్ తాప్సి. సినిమాలో నాకెన్ని పాటలుండాలి? ఫైట్లు పెట్టారా?? వినోదం శాతం ఎంత అనేది వాకబు చేయను. నా పాత్రకు వందశాతం న్యాయం చేయడం ఎలాగో ఆలోచిస్తానంతే. అసలు విషయం మీద దృష్టి పెట్టకుండా అనవసరమైన విషయాల జోలికి వెళ్తే అంతిమంగా నాకే నష్టం. పాత్రలో ఒదిగిపోయి చక్కగా నటించి ప్రేక్షకుల మెప్పుపొందడమే తన పనంటుంది ఈ సుందరి.



నెల్లూరు పురవీధుల్లో సాగుతున్న జగన్నాథ రథయాత్ర.

## కన్నుల పండుగగా జగన్నాథ రథయాత్ర!

ఇస్కాన్ ఆధ్వర్యంలో 21వ తేదీ జగన్నాథ రథయాత్ర భక్తజన సందోహం నడుమ అత్యంత వైభవంగా జరిగింది. పూరి జగన్నాథ రథయాత్ర తరహాలో దక్షిణ కోస్తాలోనే మొదటిసారిగా సింహపురి సీమలో ఈ రథయాత్ర జరగడం విశేషం. యాత్ర కోసం ప్రత్యేకంగా రూపొందించిన రథంపై జగన్నాథ, సుభద్ర, బలరామ విగ్రహాలు కొలువు దీరాయి. ట్రక్కుపై రథాన్ని ఏర్పాటు చేయడంతోపాటు హైడ్రాలిక్ సిస్టంతో రూపొందించడంతో ఎత్తును కావలసినంత మేర పెంచుకోవడం, అవసరమైన సందర్భాల్లో తగ్గించుకొనే సదుపాయం ఉండడం ఈ రథం ప్రత్యేకత. దాదాపు పది లక్షల రూపాయలు వెచ్చించి తయారుచేసిన రథంపై జగన్నాథుడిని ఊరేగించారు. ఎసి సెంటర్ నుంచి ప్రారంభమైన జగన్నాథ రథయాత్ర టిటిడి కళ్యాణ మండపం వరకు సాగింది. దేశ, విదేశాల నుంచి వచ్చిన భక్తులతో, హరేకృష్ణ సంకీర్తనలతో నగరం పులకించిపోయింది. రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి భానుశ్రీతో కలసి వచ్చి రథయాత్రను ప్రారంభించారు. ఈ కార్యక్రమం కోసం జపాన్ నుంచి వచ్చిన ఇస్కాన్ ప్రతినిధులు భానుస్వామి మహరాజ్, రష్యా పాండవ ప్రభు, నెల్లూరు ఇస్కాన్ అధ్యక్షుడు సుఖదేవస్వామి, రాజమండ్రికి చెందిన సత్యగోపీనాథ్, తిరుపతి దేవతా రమణ ప్రభుతోపాటు ఆస్ట్రేలియా, అమెరికా తదితర దేశాల నుంచి వచ్చిన శ్రీకృష్ణ భక్తులు రథయాత్ర ప్రాశస్త్యాన్ని వివరించారు. జగన్నాథ దర్శనంతో సకల శుభాలు కల్గుతాయని చెప్పారు. గాంధీబొమ్మ, ట్రంకురోడ్డు, విఆర్‌సి, ఆర్‌టిసి మీదుగా టిటిడి వరకు జరిగిన రథయాత్ర భక్తులతో కిక్కిరిసి పోయింది. రంగవల్లులు, పసుపు నీళ్లలో రోడ్లన్నీ నిండిపోయాయి. భక్తుల కోలాటాలు, భజనలు, ఆనంద తాండవాలతో, శ్రీకృష్ణ కీర్తనలతో నగరం మార్మోగి పోయింది. భక్తుల రద్దీతో నగరంలో ట్రాఫిక్‌కు తీవ్ర అంతరాయం ఏర్పడడంతోపాటు జనం తోసుకోవడంతో స్వల్పంగా తోపులాట జరగడం మినహా రథయాత్ర ప్రశాంతంగా జరిగింది.

## విజయడైరీ ఉద్యోగుల పర్మినెంటు!



కొండ్రెడ్డి రంగారెడ్డి చేసిన మంచి పని.

నెల్లూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల పరస్పర సహాయక సహకార సంఘం విజయ డైరీలో సర్టిఫైడ్ ఓవర్ వర్కర్లుగా పనిచేస్తున్న 107 మందిని పర్మినెంటు చేశారు. 19వ తేది జరిగిన పాలకవర్గ సమావేశంలో ఛైర్మన్ కొండ్రెడ్డి రంగారెడ్డి ఈ నిర్ణయం తీసుకొన్నారు. డైరీ చరిత్రలో ఇటువంటి సాహసోపేత నిర్ణయం ఇంతవరకు తీసుకోలేదు. ఈ ప్రక్రియకు మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్ రెడ్డి, నెల్లూరు రూరల్, సిటీ ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, శ్రీధర కృష్ణారెడ్డిలు సహకరించారని డైరీ ఛైర్మన్ కొండ్రెడ్డి రంగారెడ్డి చెప్పాడు. డైరీని లాభాలబాట నడుపుతున్న రంగారెడ్డి విజయ పాలు అన్ని చోట్ల దొరికేలా చేస్తే డైరీ ఆదాయం మరింత పెరుగుతుంది.

## వేడుకగా గొబ్బెమ్మల పండుగ!

చల్లని సంధ్యా సమయంలో పవిత్ర పినాకినీ తీరం గొబ్బెమ్మల ఆటపాటలతో పిల్లల గాలిపటాల సరదాలతో నూతన శోభను సంతరించుకొంది. పెద్ద పండుగ, కనుమ పండుగ ముగిసిన తర్వాత గొబ్బి గౌరమ్మను వేలాడించడం ఆనవాయితీ. దీనినే ఏటి పండుగ అంటారు. ప్రతి ఏడాది ఈ గొబ్బెమ్మ ఉత్సవాలను ఘనంగా నిర్వహిస్తున్న విధంగానే ఈ ఏడాది జిల్లా నలుమూలల నుంచి వచ్చిన భక్తుల నడుమ వైభవోపే



గొబ్బెమ్మలను నిమజ్జనం చేస్తున్న మహిళలు.

తంగా జరిగింది. వేలాదిగా జనం తరలిరావడంతో పెన్నాతీరం జనసంద్రంగా మారింది. గొబ్బి పాటలు పాడుతూ మహిళలు గౌరీదేవిని నీళ్లలో వదులుతుండగా, మరోవైపు పిల్లలు రంగు రంగుల గాలిపటాలను ఎగురవేస్తూ కేరింతలు కొడుతూ ఆటపాటలలో మునిగితేలడంతో ఆ వాతావరణం ఆహ్లాదకరంగా మారింది. దీనికితోడు జిల్లాలోని వివిధ పుణ్యక్షేత్రాలలో వెలసి ఉండే దేవతా మూర్తుల రూపాలతో పినాకినీ తీరంలో వేసిన సెట్టింగ్‌లు ఎంతో ఆకర్షణీయంగా నిలచాయి. రాజరాజేశ్వరిదేవి, రంగనాథుడు, మూలస్థానేశ్వరుడు, వెంకటేశ్వరస్వామి, రుక్మిణి, సత్యభామా సమేత వేణుగోపాలస్వామి, నర్రవాడ వెంగమాంబ, జొన్నవాడ కామాక్షితాయి, వేదగిరి నరసింహస్వామి, సింహపురి గ్రామదేవత ఇరుగాళమ్మ రూపాలతో తాత్కాలికంగా సెట్టింగ్‌లు వేయడంతో అవి నగరవాసులను విశేషంగా ఆకట్టుకొన్నాయి. పాట కచ్చేరీలు ఏర్పాటు చేయడంతో ఆ సాయంత్రం వేళ చల్లని వాతావరణంలో పిల్లలు, పెద్దలు వయో బాధలను ప్రక్కనపెట్టి సంతోషంగా గడిపారు.

## ప్రత్యేక తరగతులకు డుమ్మా

**● ప్రభుత్వ ఉపాధ్యాయులా మజాకానా?**

పదవ తరగతి విద్యార్థులకు సంక్రాంతి సెలవుల్లో నిర్వహించాల్సిన ప్రత్యేక తరగతులు కొన్ని హైస్కూళ్లలో సక్రమంగా జరగలేదు. ఈ సంవత్సరం ప్రభుత్వ పాఠశాలల్లో 100 శాతం ఉత్తీర్ణత సాధించాలన్న లక్ష్యంతో సంక్రాంతి సెలవుల్లో ప్రత్యేక తరగతులు నిర్వహించాలని విద్యాశాఖ నిర్ణయించింది. దీంతో కొన్ని పాఠశాలల్లో తరగతులు నిర్వహించగా మరికొన్ని పాఠశాలల్లో నిర్వహించ లేదు. సంక్రాంతి సెలవుల సందర్భంగా ప్రత్యేక తరగతులు నిర్వహిస్తున్నారా లేదా అనే విషయమై విద్యాశాఖ అధికారులు ఎక్కడా తనిఖీలు చేయలేదు. కొందరు ఉపాధ్యాయులు విధులకు డుమ్మా కొట్టారు. దీంతో ప్రధానోపాధ్యాయులు సైతం ఏం చేయలేక పోయారు. హాస్టల్ విద్యార్థులను సెలవుల్లో ఇంటికి పంపకుండా ప్రత్యేక తరగతుల కోసం ఉంచడం జరిగింది. అయితే ఉపాధ్యాయులు పాఠశాలకు రాకుండా డుమ్మా కొట్టడంతో ఇంటి దారి పట్టాల్సి వచ్చింది. ఉపాధ్యాయులు ఇదే వైఖరిని కొనసాగిస్తే పదవ తరగతిలో లక్ష్యాన్ని సాధించడం కష్టంగా ఉంటుంది.

## కిడ్నీ ఆపరేషన్‌కు సహకరించండి!

నెల్లూరు మూలపేటలోని రామయ్యబడిలో పదవ తరగతి చదువుతుండిన షేక్ పర్వీన్‌కు రెండు కిడ్నీలు పూర్తిగా చెడిపోయాయి. రాజీవ్ ఆరోగ్య శ్రీ కార్డు, మానవత్వంతో స్పందించిన డాక్టర్లు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, దాతల సహకారంతో వారానికి రెండు సార్లు డయాలసిస్ చేయించుకుంటూ జీవన పోరాటం చేస్తుంది. పర్వీన్‌ది నిరుపేద కుటుంబం. తండ్రి లేడు. తల్లే టైలరింగ్ చేస్తూ ముగ్గురు




వ్యాధిగ్రస్తురాలు పర్వీన్‌తో ఆమె తల్లి.

బిడ్డలను పోషిస్తుంది. పర్వీన్ సోదరి షెహనాజ్ ఇంజనీరింగ్ మూడవ సంవత్సరం చదువుతుంది. పర్వీన్‌కు సికింద్రాబాద్ కిమ్స్‌లో కిడ్నీ ఆపరేషన్ చేయనున్నారు. అమ్మే కిడ్నీ ప్రదాత. ఆరోగ్యశ్రీ కార్డు ఉన్నా ఆపరేషన్‌కు ముందు వెనుక అయ్యే ఖర్చులకు కుటుంబ పెద్ద కోలుకొనే వరకు అవసరమైన సహాయాన్ని అర్థిస్తుంది. మనసున్న మహారాజులు నెల్లూరు ఎస్‌బిఐ మెయిన్ బ్రాంచ్ అకౌంట్ నెం.30489581336లో జమ చేయవచ్చు. ప్రత్యక్షంగా సహాయం చేయాలనుకొనేవారు మహబూబ్ జానీ, 23/635, రామయ్యబడి ప్రక్క సందు, మూలపేట, నెల్లూరు – 524003కు వెళ్లి ఇవ్వవచ్చు. 97031 76036 ఫోన్‌లో సంప్రదించవచ్చు.

## పేదలకు అన్న, వస్త్రదానాలు!



వస్త్రదానం చేస్తున్న అబ్దుల్ ఖలీల్.

నెల్లూరు హరనాథపురంలో హాజీ అబ్దుల్ అజీజ్ ట్రస్ట్ నేతృత్వంలో 19వ తేది పేదలకు అన్న, వస్త్రదానం జరిగింది. ట్రస్ట్ నిర్వాహకుడు అజీజ్ తన తండ్రి షేక్ కాలేషా వర్ధంతిని పురస్కరించుకొని ఈ కార్యక్రమం ఏర్పాటు చేశారు. ఇప్పటికే పలు ప్రజోపయోగ కార్యక్రమాలు చేపడుతున్న ట్రస్ట్ తన తండ్రి వర్ధంతి రోజున మరికొన్ని అదనపు కార్యక్రమాలు చేపడుతుందని అబ్దుల్ అజీజ్ చెప్పారు. ఈ కార్యక్రమంలో అబ్దుల్ ఖలీల్, యజ్దాని, అబ్దుల్ ఖుద్దూస్, మహబూబ్, నిజామ్ తదితరులు పాల్గొన్నారు.

## పంచాయితీలవారీగా గణాంక వివరాలు

గ్రామ పంచాయితీల వారీగా గణాంక వివరాలు సేకరించేందుకు అధికార యంత్రాంగం శ్రీకారం చుట్టింది. ఈ వివరాల సేకరణ కోసం పైలట్ జిల్లాగా నెల్లూరు జిల్లాను ఎంపిక చేయడం జరిగింది. జిల్లావ్యాప్తంగా ఉన్న అన్ని గ్రామ పంచాయితీలలో సర్వే చేయించే బాధ్యతలను ప్రణాళిక సంఘంకు అప్పగించింది ప్రభుత్వం. మౌలిక సదుపాయాల కల్పన, పాఠశాలల నిర్మాణం, ప్రజల జీవన విధానం, వ్యవసాయం, పరిశ్రమల ఏర్పాటు, అక్షరాస్యత తదితర అంశాలపై సర్వే చేస్తారు. ఈ సర్వే కార్యక్రమానికి వైద్య ఆరోగ్య శాఖ తరపున ఎఎన్‌ఎంలు, గ్రామ రెవిన్యూ అధికారులు, గ్రామ పంచాయితీ కార్యదర్శులను నియమిస్తారు. ఫిబ్రవరి నెలాఖరుకు సర్వే పూర్తి చేస్తారు.

## అప్రూవర్లతో బిగుస్తున్న కేసులు

16వ పేజీ కొరవ

అనుకొన్న దానికంటే ఎక్కువ మందే ముందుకు వస్తున్నారని వినికిడి.

వీరిలో ప్రథముడు – ఎమ్మార్‌కేసులో కీలక నిందితుడైన స్టైలిష్ హోమ్స్ అధిపతి తుమ్మల రంగారావు. ఎమ్మార్ విల్లాలను గజం 50వేలకు పైగా అమ్మి, కేవలం 5వేల రూపాయల రేటుకు రిజిష్టర్ చేసిన వ్యక్తి ఆయన. మిగిలిన నల్లధన సొమ్మునంతా ఎమ్మార్ ప్రధాన లబ్దిదారు కోనేరు ప్రసాద్‌కు, రాజకీయనాయకులకు, అధికారులకు అందజేసేది రంగారావే అని చెప్తారు. ఎమ్మార్ విల్లాలలో జరిగిన అక్రమ లావాదేవీలన్నీ ఆయనకు బాగా తెలుసు. ఆయన సహకారంతోనే సిబిఐ ఇప్పుడు ఆ కేసును బిగిస్తున్నది. జగన్ సహాయకుడు సునీల్‌రెడ్డి అరెస్టుకు ఆధారం కూడా రంగారావు ఇచ్చిన వాంగ్మూలమే.

జగన్ ఆడిటర్ విజయసాయి రెడ్డి అరెస్టుకు తిక్కవరపు శ్యాం ప్రసాద్ సమాచారం ఉపకరించిందని వినికిడి. తుమ్మల రంగారావు వాంగ్మూలంతో సునీల్‌రెడ్డిని చెరపట్టారు. ఇప్పుడు తాజాగా జగన్‌ను కేసులో బిగించడానికి టిఆర్.కన్నన్ అనే తమిళుడి వాంగ్మూలాన్ని ఆధారం చేసుకొంటున్నారని తెలుస్తున్నది. టిఆర్.కన్నన్, మధురై దగ్గర రాజాపాళెంలో పెద్ద పారిశ్రామికవేత్త. స్పిన్నింగ్ మిల్లులు, పవన విద్యుత్ వంటి పరిశ్రమలున్నాయి ఆయనకు. కొత్తగా కర్నూలు జిల్లా బనగానపల్లి దగ్గర జయజ్యోతి సిమెంట్స్ అనే కంపెనీ స్థాపించాడు. ఈ కంపెనీకి కావలసిన స్థల సేకరణ, సున్నపురాయి గనుల లీజు కేటాయింపు, నీళ్ల వసతి కల్పనకు జగన్ సహాయం చేశాడట. అందుకోసం దాదాపు 30 కోట్ల రూపాయల వరకు మామూలు ముట్ట చెప్పాడట. దానిలో 5 కోట్ల రూపాయలను సాక్షి పత్రిక కంపెనీలో వాటాల రూపంలో తీసుకొన్నాడు జగన్. తనకు సున్నపు రాయి గనులు కేటాయించినందుకు ముడుపుగా మాత్రమే ఈ మొత్తాన్ని చెల్లించానని కన్నన్ సిబిఐకి సాక్ష్యంగా వాంగ్మూలం ఇచ్చినట్లు తెలుస్తున్నది. ప్రభుత్వ ప్రయోజనాలను పొందడానికి పరోక్షంగా ముడుపులు చెల్లించడాన్ని క్విడ్ ప్రోకో అంటారు. వైఎస్ హయాంలో జరిగిన అవినీతి సమస్తం ఈ కోవకే వస్తుంది. అయితే ఇప్పటి వరకు దీన్ని నిర్ధారించడానికి సిబిఐకి సరైన ఆధారం దొరకలేదు. టిఆర్.కన్నన్ సాక్ష్యంతో ఆ కొరత తీరిందని, క్విడ్ ప్రోకో క్రింద వైఎస్‌కు బదులుగా నేరుగా జగన్‌ను కేసులో బిగించడానికి ఆ సాక్ష్యాన్ని వాడ బోతున్నారని తెలుస్తున్నది. అందుకు ప్రతిగా కన్నన్‌ను అప్రూవర్‌గా పరిగణించి, క్షమాభిక్ష ప్రసాదిస్తారట. వ్యాన్‌పిక్ ఎస్ఇజెడ్ అధినేత నిమ్మగడ్డ ప్రసాద్ కూడా ఇదే కోవలో అప్రూవర్ అయ్యే ఆలోచనలో వున్నారని చెప్తున్నారు. ఐఎఎస్ అధికారి బిపి.ఆచార్య సైతం ఈ మార్గాన్నే ఎంచుకోబోతున్నాడని ఒక వార్త.

అప్రూవర్ల సంఖ్య పెరిగే కొద్దీ సిబిఐ దర్యాప్తు సులభమై పోతుంది. న్యాయస్థానంలో కేసులను తార్కిక ముగింపుకు తీసుక వెళ్లడం వీలౌతుంది. అయితే దీని వల్ల తనకు కలిగే ప్రమాదం నుంచి తప్పించుకోవడానికి జగన్ ఏ జాగ్రత్తలు తీసుకొంటున్నాడో వేచి చూడాలి.

## జగన్ గుట్టు సునీల్‌కే ఎరుక!

మొదటి పేజీ కొరవ

కానికి ఏజంట్‌గా వ్యవహరించిన స్టైలిష్ హోమ్స్ అధినేత తుమ్మల రంగారావు చంద్రబాబుకు చాలా దగ్గరివాడు. రంగారావు నుంచి జగన్‌కు చేరవలసిన సొమ్ములో అధిక భాగం సునీల్‌రెడ్డి ద్వారానే సరఫరా అయ్యిందట. ఆ విషయం చంద్రబాబుకు తెలుసు. ఆ సమాచారంతోనే ఆయన తుమ్మల రంగారావుకు నచ్చచెప్పి, సునీల్ పాత్రపై సిబిఐకి వాంగ్మూలం ఇప్పించాడని జగన్ నమ్ముతున్నాడు. అందువల్లనే కాంగ్రెస్ పార్టీ బాబుతో కుమ్మక్కై తనను వేధిస్తున్నదని విరుచుకపడ్డాడు.

సునీల్‌రెడ్డి సిబిఐ విచారణలో నోరు విప్పితే అక్రమాస్తుల కేసులో జగన్ కూరుకపోవడం ఖాయమని పరిశీలకుల అంచనా. ఇప్పటివరకు జగన్ అక్రమాస్తులనైతే సిబిఐ గుర్తించగల్గింది కానీ, అవి చట్ట విరుద్ధమని నిరూపించే ఆధారాలు, ముఖ్యమంత్రిగా వుండిన తన తండ్రి అధికారాన్ని అడ్డు పెట్టుకొని అవినీతికి పాల్పడ్డాడని రుజువు చేసే వివరాలు సిబిఐకి చాలినన్ని అందలేదు. సునీల్‌రెడ్డి ద్వారా ఆ కొరత తీరుతుందని సిబిఐ ఆశపడుతున్నది.

సునీల్‌తో పాటు మరికొందరు జగన్ సన్నిహితుల మీద కూడా సిబిఐ పడగ నీడ పాకి వుందని విశ్వసనీయంగా తెలుస్తున్నది. జగన్‌ను అరెస్టు చేసే ముందుగానే ఆయన అంతరంగికులను జైలులో పెట్టాలన్నది సిబిఐ వ్యూహమని చెప్తున్నారు. సజ్జల రామకృష్ణారెడ్డి, దివాకర్‌రెడ్డి, శ్రీనివాసులు నాయుడు, అంబటి రాంబాబు వంటి పేర్లు ఈ విషయంలో విన్పిస్తున్నాయి. ఎమ్మార్ కేసులో ఛార్జ్‌షీట్ దాఖలు చేయవలసిన సమయం దగ్గర పడింది. గాలి జనార్దనరెడ్డి కేసు పరిస్థితీ అంతే. ఒక కేసులో ముద్దాయిలను అరెస్టు చేసిన 90 రోజుల లోపల ఆ కేసుకు సంబంధించిన ఛార్జ్ షీటు కోర్టులో దాఖలు చేయాలన్నది నియమం. లేకుంటే, అరెస్టు అయిన ముద్దాయిలకు బెయిల్ మంజూరు అవుతుంది. అక్రమ ఆస్తుల కేసులో మాత్రం ఇప్పటి వరకు విజయసాయిరెడ్డి ఒక్కడిని మాత్రమే, జనవరి 2తేది అరెస్టు చేశారు. ఆ కేసులో ఏప్రెల్ వరకు గడువు వుంది. అందువల్ల మరొక ఒకటిన్నర నెల పాటు జగన్ జోలికి వెళ్లక పోవచ్చునని తాజా అంచనా. అయితే ఎమ్మార్, గాలి కేసులలో ఏదైనా ఆధారం దొరికితే మాత్రం అనుకొన్నదానికంటే ముందుగానే జగన్ అరెస్ట్ జరిగి పోవచ్చు.

## పిఎస్‌వి ప్రసాద్

మొదటి పేజీ కొరవ

ఆశ్రయించాడు. అయితే ఇంతకాలం ఆయనకు జగన్ పెద్దగా ప్రాధాన్యత ఇవ్వలేదు. ఇప్పుడు సిబిఐ ఒత్తిడి భరించ శక్యం కాని రీతిలో పెరిగి పోవడంతో, గోదావరి ఈదడానికి దొరికిందే భాగ్యమనే రీతిలో పిఎస్‌వి.ప్రసాద్‌ను అక్కున చేర్చుకొంటున్నాడు. ఆయన ద్వారా చంద్రబాబు ముఖ్యమంత్రిగా వున్న కాలంలో జరిగిన లావాదేవీలు తెలుసుకోవాలన్నది ప్రయత్నం. బాబుకు ఎక్కడెక్కడ ఎంతెంత పెద్ద ఆస్తులున్నది కూడా తనకు తెలుసునని నమ్మబలుకుతున్నాడట పిఎస్‌వి. దానితో ఆయన ఇచ్చే సమాచారాన్ని ధృవపరచుకోవడానికి ఒక ప్రత్యేక బృందాన్ని నియమించాడు జగన్. వారం పది రోజుల లోపలే బాబు అక్రమ ఆస్తుల మీద సాక్షి పత్రికలో వ్యాసాలు వ్రాయడంతో పాటు, హైకోర్టులో ఒక కేసు కూడా దాఖలు చేయాలనే ఆలోచనలో వున్నాడు జగన్.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### అమీర్‌జాన్ రికార్డు!

చేయి తిరిగిన నెల్లూరు చిత్రకారుడు అమీర్ జాన్ 63వ రిపబ్లిక్ దినోత్సవం వేడుకలను పురస్కరించుకొని 21వ తేది టౌన్‌హాల్‌లో చింతగింజల మీద 63 మంది జాతీయ నాయకుల చిత్రాలను రికార్డు సమయంలో చిత్రీకరించాడు. ఆరు గంటల 12 నిమిషాల్లో అద్భుత చిత్రాలను ఆవిష్కరించిన అరుదైన చిత్రకారునిగా ఆయన పేరు ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో చోటుచేసుకొంది. ఈ రికార్డును ప్రపంచ ప్రఖ్యాత గిన్నీస్ బుక్‌తోపాటు మరో 8 సంస్థలకు నమోదు చేయమని ఎంట్రీ పంపారాయన. పొదలకూరుకు చెందిన అమీర్‌జాన్ గత కొన్నేళ్లుగా కోమల ఆర్ట్స్ గ్యాలరీలో చిత్రకారునిగా కొనసాగుతున్నారు. స్వయం ప్రతిభతో రికార్డులు నెలకొల్పుతున్న అమీర్‌జాన్ అభినందనీయుడు.

### ఎయిర్‌పోర్ట్ వచ్చేస్తుంది!

నెల్లూరీయులకు ఎయిర్ పోర్ట్ ఆశ ఎన్నాళ్లగానో ఉంది. నెల్లూరు ఎయిర్ పోర్టుకు ప్రధాని చేత శంకుస్థాపన చేయిస్తానంటున్నాడు తిరుపతి ఎమ్పీ చింతామోహన్. దీనికి సంబంధించిన అన్ని పనులు పూర్తయ్యాయంటున్నారాయన. నెల్లూరుకు సంబంధించిన సమస్యలు పరిష్కారానికి కృషి చేస్తున్న చింతామోహన్ అభినందనీయుడు.

### ఎసి స్టేడియం వాకర్స్ అసోసియేషన్

నెల్లూరు ఎసి స్టేడియం వాకర్స్ అసోసియేషన్ అధ్యక్షునిగా రొటేరియన్ రాఘవేంద్ర షెట్టి, కార్యదర్శిగా నలబోలు బలరామయ్య నాయుడు, కోశాధికారిగా స్వర్ణ రమేష్‌లను ఎన్నుకొన్నారు. ఈ ఎన్నికలకు కిలారి తిరుపతి నాయుడు ఎన్నికల అధికారిగా వ్యవహరించారు. ఈ సంఘం పలు సాంఘిక సేవా కార్యక్రమాలు సైతం చేపడుతుంది.

### డాక్టర్ కొండారెడ్డికి అవార్డు!

నెల్లూరు నగరంలో చేయి తిరిగిన దంత వైద్యుడు డాక్టర్ జి.కొండారెడ్డికి హరివిల్లు క్రియేషన్స్ లైఫ్‌టైమ్ అచీవ్‌మెంట్ అవార్డును ప్రకటించింది. 30వ తేది టౌన్‌హాల్‌లో జరిగే ప్రత్యేక కార్యక్రమంలో అమరావతి కృష్ణారెడ్డి దీన్ని అందిస్తారు. సుప్రసిద్ధ రంగస్థల నటుడు పొన్నాల రామసుబ్బారెడ్డి గౌరవ అతిథిగా విచ్చేస్తారని హరివిల్లు క్రియేషన్ నిర్వాహకుడు దోర్నాల హరిబాబు చెప్పారు. డాక్టర్ కొండారెడ్డి అభిమానులను ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నాడు.

### వేమిరెడ్డి అన్నదానం

ఇస్కాన్ ఆధ్వర్యంలో 21వ తేది నగరంలో జరిగిన జగన్నాథ రథయాత్రకు విచ్చేసిన భక్తులకు ప్రముఖ పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి టిటిడి కళ్యాణ మండపంలో అన్నదానం చేశారు. దేశవిదేశాల నుంచి వచ్చిన కృష్ణ భక్తులు, స్థానికులు ఈ కార్యక్రమంలో తృప్తిగా భోజనం చేశారు.

### డిఎస్ఆర్ ప్యారడైజ్

నెల్లూరు అయ్యప్ప గుడి సెంటర్‌లో అత్యాధునికంగా కట్టిన హోటల్ డిఎస్ఆర్ ప్యారడైజ్‌ను ఫిబ్రవరి 3వ తేది ప్రారంభించనున్నట్లు హోటల్ అధినేత దండు దిలీప్‌కుమార్‌రెడ్డి తెలిపారు. ఈ కార్యక్రమానికి ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి, మాజీ మేయర్ భానుశ్రీ విచ్చేస్తారని చెప్పారు. హోటల్‌లో ఎసి స్టాండర్డ్ రూమ్స్, ఎగ్జిక్యూటివ్ రూమ్‌లతోపాటు ఇండియన్, చైనీస్ వంటకాల రెస్టారెంట్, ఎల్ఇడి లైటింగ్‌లో 250 మందికి సీటింగ్ కెపాసిటీ గల ఎసి ఫంక్షన్ హాల్ అందుబాటులో ఉన్నాయి. ఇందుకూరుపేట రాజకీయాల్లో రాణించిన దివంగత దండు సురేంద్రరెడ్డి కుమారుడే దిలీప్‌కుమార్‌రెడ్డి. ఆయన హోటల్ వ్యాపారంలో రాణించాలని కోరుకొంటున్నాం.

### హిజ్రాల ర్యాంప్ షో

మేమెవరికీ తక్కువ కాదని నిరూపించారు హిజ్రాలు. టౌన్‌హాలులో జనవరి 24న హెచ్ఐవి, ఎయిడ్స్‌పై ఒక కార్యక్రమం జరిగింది. జిల్లా ఎస్పీ రమణకుమార్, జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి పాల్గొన్న ఈ కార్యక్రమంలో హిజ్రాలు మోడ్రన్ దుస్తులతో ర్యాంప్‌పై నడిచి హొయలు ఒలకబోశారు. దీనిని చూసి ఆశ్చర్యపోయారు కార్యక్రమానికి వచ్చిన ఆహూతులు.

### ఆమంచర్ల మరణం

నెల్లూరీయుడు, హైకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ ఆమంచర్ల గంగాధరరావు(91) 20వ తేది హైదరాబాద్‌లో మరణించారు. నెల్లూరులో ప్రాక్టీసు మొదలెట్టిన ఆయన హైకోర్టు న్యాయవాదిగా ఎదిగారు. 1975 నుంచి 1983 వరకు హైకోర్టు జడ్జిగా పనిచేశారాయన.

### డిఎస్‌రెడ్డి మృతి

నెల్లూరు రంగనాయకులపేట డిఎస్ ఆటో మొబైల్స్ నిర్వాహకుడు దొడ్ల శ్రీనివాసులురెడ్డి(93) 19వతేది మరణించారు. రోటరీ క్లబ్‌లో వివిధ భూమికల్లో సేవలందించిన డిఎస్‌రెడ్డి కుమారుడే డిఎస్ భరత్‌కుమార్‌రెడ్డి. తండ్రి స్ఫూర్తితో రోటరీ గవర్నర్‌గా భరత్‌కుమార్‌రెడ్డి ఎంతో పేరు తెచ్చుకొన్నారు.

### ఆర్ఎస్ఎస్ నరసయ్య మరణం

రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ అగ్రశ్రేణి కార్యకర్త వై.నరసయ్య 19వ తేది నెల్లూరులోని రంగనాయకులపేటలో మరణించారు. బిజెపి అగ్రనేత వెంకయ్యనాయుడు కూడా నరసయ్యను తన గురువుగా చెప్పేవారు. జయభారత్ హాస్పిటల్ కార్యదర్శిగా, వాత్సల్య అనాధ శరణాలయం నిర్మాణం, నిర్వహణలో నరసయ్య సేవలు ప్రశంసనీయం.

### సిద్దవరపు సునీల్ మరణం

పాత రోజులలో మైకా మైన్ రంగంలో రారాజు వలె వెలిగి, విధి వక్రీకరణతో తెరమరుగై పోయిన స్వర్గీయ ఎస్.వి.కె తనయుడు, సిద్దవరపు సునీల్ కుమార్‌రెడ్డి 24వ తేది తీవ్ర అనారోగ్యంతో మరణించాడు. ఆయన వయస్సు 53 సంవత్సరాలు. సిద్దవరపు కుటుంబం సిరిసంపదలకే కాదు, స్ఫురద్రూపానికి కూడా జిల్లాలో పేరుపొందింది. కర్నాటకలో జల విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాతగా వృద్ధిలోకి వస్తున్న డి.సురేంద్రరెడ్డికి ఆయన బావమరిది. పసి వయస్సులోనే తనువు చాలించిన సునీల్‌రెడ్డి కుటుంబానికి సంతాపం తెలియజేస్తున్నాము.

ఆత్మీయులను కోల్పోయిన పై నాలుగు కుటుంబాల వారికి మా సానుభూతి.

# ఖజానా కార్యాలయాల్లో అవినీతి జలగలు!


నెల్లూరులోని జిల్లా ఖజానా కార్యాలయం.

**నెల్లూరు ఖజానా కార్యాలయంతోపాటు జిల్లాలోని మరో 14 ఉప ఖజానా కార్యాలయాల్లో అవినీతి, అక్రమాలకు అంతే లేకుండా పోయింది. ప్రతి పనికి ఓ రేటు విధించి ఇక్కడ సిబ్బంది దోచుకొంటున్నా ఉన్నతాధికారులు, ఎసిబి చూసీచూడనట్లు ఉండడం విమర్శలకు తావిస్తుంది.**

జిల్లాలోని వివిధ ప్రభుత్వశాఖల్లో అవినీతి పెచ్చుమీరుతోంది. ఆయాశాఖల అధికారులు, సిబ్బంది తీరుపై పలు ఫిర్యాదులు వస్తున్నా ఉన్నతాధికారులు హెచ్చరికలు చేస్తున్నా, ఎసిబి అధికారులు పలువురిని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకొని కటకటాల పాలు చేస్తున్నా అవినీతికి అలవాటుపడి లంచాల గడ్డి మేస్తున్న అధికారులు, సిబ్బందిలో మార్పు రావడం లేదనేందుకు నెల్లూరులోని ఖజానా కార్యాలయమే ఉదాహరణ. ప్రధాన ట్రెజరీతోపాటు జిల్లాలోని పలు ప్రాంతాల్లో గల ఉప ఖజానా కార్యాలయాల్లో అవినీతి తాండవం చేస్తోంది. ప్రతి పనికి, ప్రతి ఫైలుకు ఇంత మొత్తం అని రేటు పెట్టి వచ్చిన వారిని వాటి ప్రకారం ముక్కుపిండి వసూలు చేస్తుండడంతో వివిధ పనుల నిమిత్తమై ట్రెజరీ కార్యాలయాలకు వెళ్లే వివిధ శాఖల ఉద్యోగులు హడలిపోతున్నారు. జిల్లా ట్రెజరీ కార్యాలయం కలెక్టరేట్ ఆవరణలో వుంది. ఇవే కాకుండా గూడూరు, సూళ్లూరుపేట, వెంకటగిరి, నాయుడుపేట, వాకాడు, రాపూరు, పొదలకూరు, వింజమూరు, ఉదయగిరి, కోవూరు, ఆత్మకూరు, కావలి, బుచ్చిరెడ్డిపాళెం, ఇందుకూరుపేటలో సబ్ ట్రెజరీ కార్యాలయాలు పద్నాలుగు వరకు వున్నాయి. వీటిలో ఆయా ప్రాంతాల పరిధిలో వచ్చే ప్రభుత్వశాఖల సిబ్బంది జీతాలు, ఇతరత్రా బిల్లుల చెల్లింపులు చేస్తుంటారు. దీంతో కార్యాలయానికి వచ్చే వారి వద్ద నుంచి చేసే వసూళ్లకు అంతే లేకుండా పోతోంది. ప్రభుత్వ ఉద్యోగులకు సర్వీసు పరంగా చేకూరే వార్షిక ఇంక్రిమెంట్లు, ఆటోమాటిక్ అడ్వాన్స్‌మెంటు స్కీం ఇంక్రిమెంట్లు, స్టెప్‌అప్ బిల్లుల ఆమోదం కోసం ఖజానా కార్యాలయాలకు వెళ్లే ఉద్యోగస్తులను నిలువు దోపిడీ చేసేస్తున్నారు. ఒక్కబిల్లు చేసేందుకు దాని ప్రాధాన్యతను, ఉద్యోగికి కలిగే లబ్దిని బట్టి ఇంత పర్సెంటేజని లెక్కకట్టి వసూలు చేస్తున్నారట. ట్రెజరీ సిబ్బంది డిమాండ్ చేసినంత మేర లంచం ఇచ్చుకోలేని వారి ఫైళ్లను ఏదో ఒక కొర్రీ వేసి రోజులు, నెలల తరబడి తిప్పుకొంటుండడం పలు రకాలుగా ఇబ్బంది పెడుతుండడంతో ఈ బాధలు పడలేక వారు అడిగినంత సమర్పించుకోవాల్సి వస్తోందని వాపోతున్నారు పలువురు. ముఖ్యంగా మెడికల్ రీఎంబర్స్‌మెంటు బిల్లుల చెల్లింపులు వస్తే ట్రెజరీ కార్యాలయ సిబ్బందికి పండుగేనట. లక్ష రూపాయలకు మూడువేలు వంతున వసూలు చేస్తారట. ఇక ఉద్యోగుల సరెండర్ లీవులు, ఫెస్టివల్ అడ్వాన్సు బిల్లులు చేసేందుకు 200 నుంచి 500 రూపాయలు, ఇంక్రిమెంట్లు ఇతరత్రా బిల్లులకు 500 రూపాయల నుంచి 1000 రూపాయలు వసూలు చేస్తున్నట్లు సమాచారం. వీరి లంచాల దోపిడి అధికం కావడంతో ఉద్యోగులు తట్టుకోలేక తమ యూనియన్‌ల ద్వారా మాట్లాడించి టోకున ఇంత మొత్తం ఇచ్చేటట్లు బేరం కుదుర్చుకొన్నారట ఇటీవల. ఇంత బరితెగింపుగా, నిసిగ్గుగా ట్రెజరీ కార్యాలయాలలోని కొందరు సిబ్బంది లంచాల గడ్డి మేస్తున్నా ఆశాఖ అధికారులు పట్టించుకోకపోవడం పట్ల వారికీ ఇందులో వాటాలు అందుతున్నాయన్న ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. 

# కార్పొరేషన్ సిటీ ప్లానింగ్ విభాగంలో బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్ హవా!



నెల్లూరు కార్పొరేషన్ కార్యాలయంలోని టౌన్ ప్లానింగ్ విభాగం.

**నెల్లూరు కార్పొరేషన్ కార్యాలయంలో అర్హతలు లేని వ్యక్తిని అధికార పార్టీకి చెందిన ప్రజాప్రతినిధి బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్‌ను చేశారు. అప్పటి నుంచి ఆయన అక్రమ సంపాదనే ధ్యేయంగా ముందుకు సాగుతున్నాడు. ఆయన తీసుకెళ్లే ఏ ఫైల్‌ను తిరస్కరించే సాహసాన్ని ఈ కార్యాలయంలోని ఏ ఉన్నతోద్యోగి చేయలేకపోతున్నాడు.**

రాజకీయ నేతల సహకారం వుంటే దేనినైనా సాధించవచ్చునని నిరూపిస్తుంటారు కొందరు. బయట వ్యక్తులతో ప్రభుత్వ ఉద్యోగులు సైతం పోటీపడి తాము అనుకొన్నది సాధిస్తున్నారు. ఇందుకు ఉదాహరణగా నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌ను పేర్కొనవచ్చు. ఈ కార్యాలయంలో ఉద్యోగిగా పనిచేసే చిన్న వ్యక్తి అదే కార్యాలయంలో అధికారులను శాసించే స్థాయికి ఎదిగాడు. ఈ ఉద్యోగి ఏ ఫైల్ తీసుకెళ్లినా అధికారులు సంతకాలు చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. సంతకాలు చేయకుండా ఏమాత్రం ఆలస్యం చేసినా ఇతని వెనుక వున్న ప్రజాప్రతినిధికి వెంటనే ఫిర్యాదు వెళ్లిపోతుంది. దీంతో విధిలేని పరిస్థితుల్లో సంతకాలు చేస్తున్నారు.

వివరాల్లోకి వెళితే నగరంలో పెన్నానది సమీపంలో వున్న తిక్కన పార్కులో విధులు నిర్వహించే వ్యక్తి రాజకీయ నేతల సిఫార్సుతో కార్పొరేషన్ కార్యాలయంలో జూనియర్ అసిస్టెంటుగా చేరాడు. కొద్దికాలం పాటు ఇదే పోస్టులో పనిచేసిన ఆయన కార్యాలయంలో జరుగుతున్న అవినీతి, అక్రమాల వ్యవహారంపై దృష్టి సారించాడు. తాను కూడా అనతి కాలంలోనే ధనార్జన చేయాలన్న ఆలోచనను అమలుపరచేందుకు ప్రజాప్రతినిధిని ఆశ్రయించి సిటీప్లానింగ్ విభాగంలో బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్‌గా నియమించాలని విన్నవించుకున్నాడు. ఇంకేముంది ప్రజాప్రతినిధి బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్‌గా నియమించాలని సంబంధిత అధికారికి ఆదేశాలు జారీ చేశాడు.

ఆదేశాలొచ్చిందే తడవుగా వెంటనే నియామకం జరిగిపోయింది. జూనియర్ అసిస్టెంటుగా విధులు నిర్వహించే వ్యక్తికి బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్‌గా నియమించే సమయంలో అవసరమైన అర్హతలు ఉన్నాయా? లేవా? అని పరిశీలన చేయాల్సి వుంటుంది. అయితే కార్పొరేషన్ కార్యాలయంలో నిబంధనల కంటే ప్రజాప్రతినిధుల ఆదేశాలకే అధిక ప్రాధాన్యతనిస్తుంటారు. బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్‌గా నియమితులు కావాలంటే ఐటిఐ, పాల్‌టెక్నిక్‌లో, డ్రాఫ్ట్‌మెన్ సివిల్ కోర్సు పూర్తి చేసి వుండాలి. పై అర్హతలను ఏమాత్రం పరిగణలోకి తీసుకోకుండానే బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్‌గా నియమించడంపై క్రిందిస్థాయి ఉద్యోగులు అధికారుల తీరును విమర్శిస్తున్నారు. ఎన్ని విమర్శలు వచ్చినా తమకేమీ కాదన్న ధీమాతో అధికారులు పట్టించుకోవడం మానేశారు.

బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్‌గా బాధ్యతలు చేపట్టిన వ్యక్తి అక్రమ సంపాదనే ధ్యేయంగా చేసుకొని ఆ మార్గంలోనే విధులు నిర్వహిస్తున్నాడు. ఇతనికి కేటాయించిన డివిజన్‌తోపాటు ఇతర డివిజన్‌లలో కూడా నూతనంగా నిర్మించే భవనాలకు అనుమతులు జారీ చేయిస్తున్నాడు. భవన నిర్మాణ ప్లాన్లపై ఎటువంటి అవగాహన లేకపోయినా భారీస్థాయిలో ముడుపులు తీసుకొని అధికారుల చేత అనుమతి ఇప్పించడంలో దిట్టగా మారాడు. అనుమతులు కావాల్సిన వారు ఇతనినే ఆశ్రయిస్తున్నారు. నిబంధనల ప్రకారం ప్లాన్ వుందా, నిర్మాణాలు జరుగుతున్నాయా? అన్న దాని గురించి పరిశీలన చేసిన సందర్భాలు కనిపించడం లేదు. కార్పొరేషన్ కార్యాలయంలో వసూళ్ల రాజాగా ఇతనికి పేరుంది. అధికారపార్టీకి చెందిన ఒక ప్రజాప్రతినిధి మద్దతు వుండడం వలన ఏం చేసినా చర్యలు తీసుకొనే అవకాశం అధికారులకు లేకుండా పోయింది.

ఈ ఉద్యోగి టేబుల్ నుంచి ఫైలు కదిలిందంటే సిటీ ప్లానింగ్ విభాగంతోపాటు ఇంజనీరింగ్ విభాగం అధికారులు సైతం భయపడుతున్నారంటే ఇతని హవా ఎలా కొనసాగుతుందో వూహించుకోవచ్చు. ఈ వ్యవహారంపై కమిషనర్ దృష్టికి పలువురు ఉద్యోగులు తీసుకెళ్లినా సర్దుకుపోవాలని సూచించినట్లు తెలిసింది. భవన నిర్మాణాల ప్లాన్లకు అనుమతిప్పించేందుకు వసూలుచేసే మామూళ్లు లక్షల రూపాయలలో వుంటాయి. అర్హతలేని వ్యక్తిని అందలమెక్కించడంతో ప్రజాప్రతినిధికి సైతం అతను కొంత వాటా అందజేస్తున్నట్లు ప్రచారం జరుగుతోంది.

## ● జగన్ ఎమ్మెల్యేలకు

# మరోసారి గాలం!

జగన్ వర్గం ఎమ్మెల్యేలు కాంగ్రెస్‌కు తలపోటు తెప్పిస్తున్నారు. శాసనసభలో అవిశ్వాసంపై విప్‌ను ధిక్కరించి ఓటు చేసినప్పటి నుంచి వారితో ఎట్లా వేగాలో ఇటు ముఖ్యమంత్రికి అటు స్పీకర్‌కు అర్ధం కావడం లేదు. పార్టీ ఫిరాయింపుల నిరోధం క్రింద ఒక్క కలం పోటుతో వీరందరినీ పదవుల నుంచి తొలగించవచ్చు. కానీ దానివల్ల కాంగ్రెస్‌కు లాభం కంటే నష్టమే ఎక్కువ. ఒకేసారి 17 స్థానాలలో ఉప ఎన్నికలు వస్తాయి. ఇప్పటికే 7 స్థానాలు సిద్ధంగా వున్నాయి. అన్ని ఉప ఎన్నికలను ఎదుర్కొనే ధైర్యం, రాజకీయ సమర్ధత కాంగ్రెస్‌కు లేవు. ప్రజలలో జగన్‌కు వున్న మోజు అందరికీ తెలుసు. ఉప ఎన్నికలంటూ జరిగితే జగన్ రాజకీయ ప్రాభవం ఆకాశమంత ఎత్తుకు ఎగబ్రాకుతుంది. కాంగ్రెస్, టిడిపిల ప్రతిష్ట పాతాళానికి దిగజారుతుంది. సాధారణ ఎన్నికలకు ఒక సంవత్సరం ముందుగా ఈ తీరులో ప్రజా తిరస్కారానికి గురైతే ఎంత ప్రమాదమో వివరించి చెప్పనవసరం లేదు. ఆ విపత్తును తెచ్చుకోవడానికి కాంగ్రెస్ సిద్ధంగా లేదు. అది తప్పాలంటే, ఉప ఎన్నికలు జరగకూడదు. కానీ జగన్ ఎమ్మెల్యేలు పట్టు వదలడం లేదు. ఇప్పటికే స్పీకర్ వ్యవహారశైలి విమర్శలకు దారి తీస్తున్నది.. ఆయన రాజ్యాంగ ధర్మాన్ని పాటించడం మాని, రాజకీయ మర్మాన్ని అనుసరిస్తున్నాడని నింద వేస్తున్నారు. ఇంకా ఈ సమస్యను సాగదీస్తే స్పీకర్ పదవికి వున్న హుందాతనం అగౌరవాన్ని మూట కట్టుకొంటుంది. మొదటగా ఖాళీ అయిన 7 శాసన సభ స్థానాలకు ఉప ఎన్నికల నోటిఫికేషన్ వచ్చిన తర్వాత, ఈ 17 మంది మీద అర్హత వేటు వేస్తే రెండింటికీ మధ్య కొంతగడువు వుంటుందని భావించారు. కానీ ఢిల్లీ ఎన్నికల కమిషన్ ఏ కారణం చేతనో నోటిఫికేషన్ ఇవ్వలేదు. ఏప్రెల్ నెల మొదటి వారం వరకు ఇచ్చే సూచన కన్పించడం లేదు. అంతవరకు 17 మంది మీదున్న అనర్హత కేసును నాన్చడం దుర్లభం. ఫిబ్రవరి 8తేది వీరిపై తన నిర్ణయాన్ని ప్రకటించి వేస్తానని స్పీకర్ స్పష్టంగా చెప్పివేశాడు. అంతకంటే ఆలస్యం చేయడం తన వల్ల కాదని తేల్చి చెప్పాడు. అదే జరిగితే మొత్తం 24 స్థానాలకు ఒకేసారి నోటిఫికేషన్ వస్తుంది.

దాన్ని నివారించాలంటే, జగన్ పక్షంగా వున్న వారిలో కనీసం ఏడెనిమిది మంది ఎమ్మెల్యేలను తిరిగి వెనక్కు తీసుక రావడం ఒక్కటే మార్గం. ఆ దిశలో గాలం వేసి, కుస్తీ పడుతున్నాడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి. అందుకోసం పెద్ద ప్రయత్నమే మొదలైంది. జగన్ వర్గంలో వున్న ఎమ్మెల్యేల వ్యాపారాలు, రాజకీయ అవసరాలు, ఆర్థిక పరిస్థితుల మీద లోతుగా అధ్యయనం చేసి, వారి బలహీనతల ఆధారంగా తమ వైపుకు లాక్కోవాలన్నది ముఖ్యమంత్రి ప్రయత్నం. ఇందులో ఆయన ఎంతవరకు సఫలీకృతుడౌతాడో తెలియదు. ఇప్పటి వరకు మాత్రం ఒక్క జగన్ ఎమ్మెల్యే కూడా కాంగ్రెస్‌లోకి తిరిగి వచ్చే ఆలోచన చేయడం లేదు.

---

# అప్రూవర్లతో బిగుస్తున్న కేసులు!

- జగన్‌కు లంచం చెల్లించానని వాంగ్మూలం ఇచ్చిన తమిళ పారిశ్రామికుడు.
- అదే దారిలో బిపి ఆచార్య.
- తుమ్మల రంగారావు సాక్ష్యంతో ఎమ్మార్ కేసు పటిష్టం!
- అప్రూవర్‌గా మారితే క్షమాభిక్ష.

జగన్ అక్రమ ఆస్తులు, ఎమ్మార్, గాలి జనార్ధనరెడ్డి గనుల దోపిడీ కేసుల్లో నిందితులను చట్టం వుచ్చులో బిగించడానికి అప్రూవర్ల మార్గం ఎంచుకొంటున్నది సిబిఐ. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని 306 సెక్షన్‌లో వున్న చిన్న అవకాశాన్ని ఎంతో సమర్ధవంతంగా వాడుకొంటున్నది.

ఈ చట్టం ప్రకారం ఒక కేసులో నిందితులు విచారణ సమయంలో కానీ, ఛార్జిషీట్ పెట్టిన తర్వాత కానీ అప్రూవర్‌గా మారడానికి సిద్ధపడితే, శిక్ష నుంచి మినహాయింపు ఇచ్చే అధికారం న్యాయమూర్తులకు వుంటుంది. నేరంలో తనూ ఒక భాగస్తుడైనప్పటికీ, తన పాత్రతో పాటు సహ నిందితుల ప్రమేయాన్ని సాక్ష్యంగా వెల్లడించడానికి సిద్ధపడే వాడిని అప్రూవర్ అంటారు. నేరుగా నేరం చేయకుండా, నేరం చేయడానికి సహకరించిన వారిని, సహ పాత్ర పోషించిన వారిని మాత్రమే సాధారణంగా అప్రూవర్లుగా అనుమతిస్తాయి న్యాయస్థానాలు. అట్లా అప్రూవర్‌గా మారిన వారిని నిందితులుగా కాక సాక్ష్యులుగా పరిగణించి, వారికి శిక్ష నుంచి క్షమాభిక్ష ప్రసాదిస్తారు.

జగన్ కేసులో నిందితులైన పారిశ్రామికవేత్తలు, అధికారులను ఈ మార్గంలో ప్రలోభపెడుతున్నది సిబిఐ. అవినీతి నిరోధక చట్టం ప్రకారం లంచం తీసుకొన్న వాడితో పాటుగా, ఇచ్చినవాడు కూడా నేరస్తుడే అవుతాడు. అందువల్ల చాలామంది పారిశ్రామికవేత్తలు జగన్ కేసుల్లో పీకల లోతు కూరుకపోతున్నారు. కేసులో తమకు సహకరించి, అప్రూవర్‌గా మారి, అసలు నిందితులకు శిక్ష పడేట్లు సాక్ష్యం చెప్తే మిమ్మల్ని వదలి పెడతామని ఆశ పెడుతున్నది సిబిఐ. దానికి

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com